


సంపుటి:1 సంచిక: 4 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 రూ. ఏప్రియల్ 2015



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**Title Verified By RNI**
APTEL/14249/01/1/2014-TC

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**సహకారం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు: 9491870753

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887

# విషయసూచిక

## ముందుమాట





## ధారావాహిక





## పిల్లలు రాసిన కథలు









## పెద్దలురాసిన కథలు









## అవీ ఇవీ







ముఖచిత్రం: కొత్తపల్లికి ఏడేళ్లు

*చిత్రకారుడు: K. శివ ప్రసాద్, Ph: 9652769003*




# సప్తకం!

"అప్పుడు రాజకుమారుడు కీలుగుర్రం ఎక్కి ఎగురుకుంటూ పోయాడు... ఏడు సముద్రాలు దాటాడు.. అయినా రాజకుమారి జాడలేదు.." తాత గట్టిగా అనుకున్నాడు- తనకూ, చిట్టికీ మాత్రమే వినబడేట్లు.

"ఏమంటున్నావ్.. గట్టిగా చెప్పు, మళ్ళీ!" అరిచింది చిట్టి.

ఆ అరుపులకు మరో పదిమంది పిల్లలు వచ్చి చేరారు తాతయ్య చుట్టూ.

"ఏంలేదు, ఏం లేదు, ఏదో గుర్తొస్తేనూ.." గొణిగాడు తాతయ్య.

"ఏదో కథ అయ్యుంటుంది. చెప్పు. విని పోతాం" సూటిగా అడిగేశాడు రవి.

"కథేం కాదు గానీ..మీకందరికీ పని! పెద్ద పెద్ద పొడుపులు! మీకు ఎంత తెలివి ఉందో మరి!" అన్నాడు తాతయ్య, పిల్లల్ని బెదిరిస్తున్నట్లు.

"తెలివి నీ సొత్తేనా? మమ్మల్ని అడిగి చూడు, దానికేం!" అన్నాడు ఐదేళ్ల బాబి- అందరూ

నవ్వారు.

"సరేరా, అయితే చెప్పండి చూద్దాం. రాకుమారుడు ఏడు సముద్రాలు దాటాడట కదా, ఏమిటా ఏడు సముద్రాలు?"

"అవును తాతయ్యా, మహాసముద్రాలు ఐదే కదా ఉన్నది?" అడిగింది సుధ, ఆలోచనలో పడి.

"మన కథల్లో వచ్చే ఏడూ వేరు- "ఉప్పు సముద్రం, చెరకు సముద్రం, కల్లు సముద్రం, నేతి సముద్రం, పాల సముద్రం, పెరుగు సముద్రం, మంచి నీళ్ళ సముద్రం- ఇవి ఏడూనట! ఊరికే కథలు చదివి ఏం లాభం?" వెటకారంగా నవ్వాడు తాతయ్య.

"తాతయ్యా, నీ తెలివీ చూస్తాను- ఏడు వారాలు ఏంటో చెప్పు చూస్తాను?!" వెంటనే గట్టిగా అడిగేశాడు బాబి, రోషంగా.

అందరూ నవ్వారు. "నాకు తెలీదురా బాబీ, నువ్వే చెప్పు!" అన్నాడు తాతయ్య.

"ఆదివారం, సోమవారం, మంగళవారం, బుధవారం, గురువారం, శుక్రవారం, శనివారం- ఇవి ఏడూ వారాల పేర్లు" చెప్పాడు బాబీ టకటకా. అందరూ చప్పట్లు కొట్టారు.

"బాగుందిరా, మీ తాతయ్యకు ఇది తెలీకనా?!" అన్నది మామ్మ, వచ్చి కూర్చొని.

"ఆఁ వచ్చావా, నీ తెలివీ చూస్తాను. నీ పెళ్ళప్పుడు నీకు ఏడువారాల నగలు ఉండేవటనే, వాటిలో ఏమేం ఉంటై, చెప్పు చూద్దాం?!" మామ్మని అడిగేశాడు తాతయ్య గడుసుగా.

"చెప్పు మామ్మా! మాకు ఆ నగలేంటో కూడా తెలీవు ఇప్పుడు" అంది రాధిక.

"ఆలోచించనివ్వండి.. వారానికొకటి.. సూర్యుడికి కెంపులు, చంద్రుడికి ముత్యాలు, కుజుడికి పగడాలు, బుధుడికి పచ్చలు, గురుడికి పుష్యరాగాలు, శుక్రుడికి వజ్రాలు, శనికి నీలాలు- అంతేగా?" అంది మామ్మ, వేళ్ళు లెక్క పెట్టుకుంటూ.

"వామ్మో! నీకు గుర్తున్నాయే!" ఆశ్చర్యపోయాడు తాతయ్య.

"తాతయ్యా! ఇంద్రధనస్సులో ఏమేం రంగులుంటై, చెప్పు. తెలుగులో చెప్పాలి!" అడిగింది

సుధ.

"ఇంద్రధనస్సు రంగులు ఏడు- ఊదారంగు, 'ఇండిగో', నీలం, ఆకుపచ్చ, పసుపు పచ్చ, నారింజ, ఎరుపు- నిజమే, ఇండిగో కూడా ఓ రకం నీలమేగా, మరి దాన్ని ఆకాశనీలం అనాలేమో!" మూతి ముడుచుకున్నాడు తాతయ్య. "-అయినా మీకు మన దేశం గురించి ఎంత తెలుసో చూస్తాను. మన దేశంలో "ఏడు అక్కచెల్లెళ్ళు- సెవెన్ సిస్టర్స్" ఏమిటి, ఎక్కడున్నాయి?"

"నాకు తెలుసు! నిన్ననే చదివాను! మన దేశంలో ఉన్న ఏడు ఈశాన్య రాష్ట్రాలు- అస్సాం, మణిపూర్, మేఘాలయ, మిజోరాం, నాగాలాండ్, త్రిపుర- వీటిని సెవెన్ సిస్టర్స్ అంటారు!" అరిచాడు శివకుమార్, ఉత్సాహంగా.

"ఎవ్వరూ చెప్పలేరనుకున్నానురా, నీకు ఐదు మార్కులు!" నవ్వాడు తాతయ్య.

"నేను పోతాను నాయనా. ఇక్కడ కూర్చుంటే పనులు ఇంక అయినట్లే. మిమ్మల్ని ఈయన బారినుండి ఆ ఏడుకొండలవాడే కాపాడాలి" అంటూ లేచింది మామ్మ.

"ఆగాగు- ఇది చెప్పిపో- ఆ ఏడుకొండలూ ఏంటి?" అడుగుతుంటే తాతయ్య కళ్ళు మెరిసాయి.

"రోజూ సుప్రభాతంలో చదివేదేగా, ఆ మాత్రం తెలీదా ఏంటి- శ్రీశైలం, శేషశైలం, గరుడాచలం, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, వృషాద్రి" అన్నది మామ్మ. పిల్లలంతా చప్పట్లు కొట్టారు. "మీ తెలివికి నేనూ ఓ పరీక్ష పెడతాను ఆగండి- "సప్త ద్వీపా వసుంధరా" అని చెబుతారు మన పెద్దలు. ఆ రోజుల్లో భూమి ఏడు ముక్కలుగా ఉండేదట. ఏమిటా ద్వీపాలు, చెప్పండి చూద్దాం" నిలబడే అడిగింది మామ్మ!

"వావ్! మామ్మా! నువ్వు మావైపు! ఇప్పుడు తాతయ్య ఆట కట్టు!" అరిచారు పిల్లలంతా మామ్మ చేతులు పట్టుకొని లాగుతూ. మామ్మ మురిసిపోయింది. "చెప్పండి చెప్పండి! ఊరికే పిల్లల్ని ఏడిపించటం కాదు!" అన్నది.

"ఏమోనే, తెలీదు- మనదేశం జంబూద్వీపంలో ఉన్నదని మాత్రం తెలుసు మిగతావి నీకు తెలుసా?" అడిగాడు తాతయ్య.

"ఓఁ.. జంబూ ద్వీపం, ప్లక్ష ద్వీపం, శాల్మలి ద్వీపం, కుశ ద్వీపం, క్రౌంచ ద్వీపం, శాక ద్వీపం, పుష్కర ద్వీపం- ఇవి సప్త ద్వీపాలు" అన్నది మామ్మ.

"మామ్మ సాయం తీసుకోవటం కాదురా, సొంత తెలివి వాడాలి. నువ్వు చెప్పరా శివా, ఏడు ఖండాలు ఏంటి?" తిరగబడ్డాడు తాతయ్య.

"బాబి గాడిని అడిగినా చెబుతాడు. ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, అంటార్క్‌టికా- ఏడు ఖండాలు" టకటకా చెప్పాడు శివ. పిల్లలంతా నవ్వారు ఉత్సాహంగా.

"తాతయ్యా! ఇది చెప్పు- సప్తధాతువులంటే ఏంటి, అవి ఏవి?" అడిగింది శర్వాణి. శర్వాణికి ఆయుర్వేదం అంటే ఇష్టం.

"ఆయుర్వేదం ప్రకారం శరీరం ఏడు ధాతువులతో తయారైంది. రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము- ఏ వ్యాధి వచ్చినా వీటిలో ఏవి దోషాలకు గురయ్యాయో కనుక్కొని, అవి నయమయ్యేందుకు ఔషధాలు ఇస్తారు ఆయుర్వేద వైద్యులు! అవునా?" వివరంగా చెప్పి అడిగాడు తాతయ్య.

"బాగానే ఉంది తెలివి. ఇక మన దేశపు పవిత్ర నదులు ఏడు- సప్తనదులు- అవేంటి, చెప్పండి- గుర్తున్నాయా, లేవా? వాటిని రోజూ తలచుకోవాలని చెప్పారు మన పెద్దలు!" అడిగింది బామ్మ. చిట్టికి మామ్మ నేర్పిన శ్లోకం ఒకటి గుర్తొచ్చింది- టక్కున చెప్పేసింది- "గంగ, యమున, సరస్వతి, గోదావరి, సింధు, నర్మద, కావేరి" అని. అందరూ చప్పట్లు కొట్టి మెచ్చుకున్నారు. బామ్మ దాన్ని ఎత్తుకొని ముద్దుపెట్టుకొని, "మరి మన పురాణాల్లో ఉన్న సప్త చిరంజీవులు ఎవరు? చెప్పండి" అన్నది మిగతా పిల్లలతో.

"వామ్మో! విననే లేదు!" అన్నాడు తాతయ్య. పిల్లలెవ్వరికీ వాళ్లెవరో తెలీలేదు.

"అశ్వత్థామ, బలి చక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు, కృపుడు, పరశురాముడు, వ్యాసుడు- వీళ్ళు సప్త చిరంజీవులు. అంటే వీళ్ళని లోకం ఎప్పటికీ మరచిపోదన్నమాట!" మామ్మే చెప్పింది.

"మరి, కృపుడు ఎవరు మామ్మా?!" అడిగాడు బాబీ, అమాయకంగా. పిల్లలు అందరూ నవ్వారు.

"ఇంకా ఉన్నాయి చాలా ఏళ్ళు.. ప్రపంచపు ఏడు వింతలు ఏంటి, చెప్పండిరా?!" అడిగాడు తాతయ్య.

"అందరూ నిశ్శబ్దం అయ్యారు- తాజ్ మహల్.." మొదలు పెట్టాడు శంకర్.

"లేదు నాన్నా! పరంపరగా వస్తున్న ప్రపంచ వింతల్లో అసలు తాజ్ మహల్ ఉండేది కాదు. ఈమధ్యే ఏర్పడిన ప్రైవేటు సంస్థ ఒకటి ఇంటర్నెట్లో వోటింగు ద్వారా ఏడు వింతల్ని ఎంపిక చేసింది- ఆ పట్టీలో తాజ్‌మహల్ ఉంది అంతే. అయితే ఐక్యరాజ్య సమితి వారు ఆ పట్టీని అంగీకరించలేదు. అయినా వింతలు వింతలేలే, ఏవైనా చూడదగ్గవే, తెలుసుకోదగ్గవే!" అన్నాడు తాతయ్య, వెంటనే "శోభిల్లు సప్తస్వర సుందరుల భజింపవే ఓ మనసా"అని జగన్మోహిని రాగంలో త్యాగరాయ కృతిని అందుకుంటూ.

"మాకు తెలుసు- సంగీతపు స్వరాలు కూడా ఏడేలే... అయినా ఈసారి 'ఏడు'ని పట్టుకున్నావెందుకు తాతయ్యా?" అడిగింది సుధ, అనుమానంగా.

"ఏంలేదు, కొత్తపల్లికి ఇప్పుడు ఏడేళ్ళు నిండాయి కదా, అందుకని గుర్తొచ్చింది!" నవ్వాడు తాతయ్య.

అభిమానులకందరికీ ఏడేళ్ళ నమస్సులు!

కొత్తపల్లి బృందం.





# నీతి చంద్రిక

సంధి-11

*జరిగిన కథ : రాజ్యాన్ని తిరిగి హంసకే కట్టబెట్టమనటం నెమలికి ఏమంత ఇష్టం కాలేదు. కానీ మంత్రితో బాటు తన గెలుపుకు కారణమైన మేఘవర్ణుడు కూడా అదే సలహా ఇవ్వటం దానికి ఆశ్చర్యంగా ఉన్నది. కాకి దానికి మందవిషం అనే పాము కథ చెప్పింది.. ఇక చదవండి, నీతి చంద్రిక 58 వ భాగం.*

*మూలం : కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*



"అట్లాగ, నేను కూడా ఆ మందవిషం లాగానే అవమానానికి ఓర్చుకొని, శత్రువుల ఆలోచనను అణచి, మన పనిని నెరవేర్చుకొని వచ్చాను. భగ్గున మండే దావానలం వృక్షాల కొమ్మల్ని, ఆకుల్ని కాల్చి విడిపెడుతుంది తప్పిస్తే, ఆ చెట్లను నిర్మూలించలేదు. నదీ జలం చల్లనిదైనప్పటికీ తనకు అడ్డువచ్చినప్పుడు తీరంలో ఉన్న

వృక్షరాజాలను వ్రేళ్లతో సహా పెకలించి వేస్తుంది- కాబట్టి, మంచి మాటలతో సాధించగలిగే పనులను వంద యుద్ధాలు చేసి కూడా నెరవేర్చుకోలేము. ఏది ఎలాగున్నా 'హిరణ్యగర్భుడు సంధికి తగినవాడు' అనే నా విశ్వాసం" అన్నది మేఘవర్ణం.



అప్పుడు మంత్రి దూరదర్శి చిత్రవర్ణుడి వైపుకు తిరిగి "ప్రభూ! ఏరకంగా చూసినా ఇప్పుడు హిరణ్యగర్భుడితో సంధి చేసుకొని అతని రాజ్యానికి ఎప్పటిలాగా అతనినే రాజుగా పున: ప్రతిష్ఠించటం శ్రేయస్కరం అనిపిస్తున్నది. ఇవాల్టి ఉదయాన్నే మన గూఢచారులు ఒక సమాచారం అందించారు- "కొద్దిరోజుల క్రితమే కర్పూరద్వీపం నుండి ఒక కొంగను సింహళద్వీపపు రాజైన మహాబలుడి దగ్గరికి పంపారు" అని. ఆలోచిస్తే, హిరణ్య గర్భుడు ఆ దూతను అక్కడికి పంపించిన ఉద్దేశం స్పష్టంగా తెలుస్తున్నది- "మనతో యుద్ధం చేయటంలో మహాబలుడి సాయాన్ని కోరుతున్నాడు హిరణ్యగర్భుడు"!

మన ఈ ఊహ నిజమైతే- గతంలో ఒకసారి మహాబలుడు కూడా మనచేత ఓడించబడి అవమానాలకు గురైనవాడే- కాబట్టి, అతను మహా సంతోషంగా హిరణ్యగర్భుడికి తోడ్పడుతాడు- సందేహం లేదు. వాళ్లిద్దరూ కలుసుకొని మన మీదకి యుద్ధానికి రావటం గనగ జరిగిందంటే, మన ప్రస్తుత స్థితిని దృష్టిలో ఉంచుకొని చెబుతున్నాను- మనం వాళ్లని గెలవటం దాదాపు అసాధ్యం!

అందువల్ల హిరణ్యగర్భుడితో సంధి చేసుకోవటమే 'ఉత్తమం' అని నాకు అనిపిస్తున్నది" అన్నది.

మంత్రి మాటలు విని చిత్రవర్ణుడు ఈసడింపుగా నవ్వుతూ "ఏనాడైతే ఆ హంసరాజు మన చేతిలో ఓడిపోయాడో,

ఆనాడే అతను పూజార్హమైన స్థానాన్ని కోల్పోయి, మనకు సేవకునితో సమానుడయ్యాడు. అట్లాంటి వాడిని మళ్లీ ఓసారి తెచ్చి గౌరవిస్తూ రాజపీఠం మీద కోర్చోబెట్టవలసినంత అవసరం మనకు ఇప్పుడు ఏం వచ్చింది?

నిజంగానే అంత అవసరం వస్తే అప్పుడు ఏదో ఒకటి చేద్దాంలే. పంటను విరగకాసేంత వరకు పెంచి అటు తర్వాత నక్కలకు పెట్టినట్లు, బాహుబలంతోటీ, ధైర్యంతో కష్టపడి గెల్చుకున్న రాజ్యాన్ని, అనుభవించే కాలం వచ్చాక, ఇప్పుడు పరాయి వాడి పాలు చేయమంటారేమి?

మహాబలుడికి ఇందులోకి దూరవలసిన అవసరం అసలు ఏమున్నది? అయినా అతను అంత ఇష్టపడి దూరితే, దూరనివ్వండి! నా ప్రతాపపు సెగ ఎంత తీవ్రంగా ఉంటుందో అతను మళ్ళీ ఓసారి తాజాగా రుచి చూస్తాడు-"

అని ఇంకేదో అనబోతుండగానే చిలుక ఒకటి రొప్పుకుంటూ వారి వైపుకు పరుగుపరుగున వచ్చింది. దూరం నుండే అది "మహారాజా! సింహళ ద్వీపపు రాజు పెద్ద సైన్యంతో వచ్చాడు! మన పట్టణాన్ని ఆక్రమించేందుకు గాను ఊరి బయటే విడిది చేస్తున్నాడు!" అని కేకలు పెట్టింది.

నెమలి రాజు ఆ కేకలు విని ఉలిక్కిపడి "ఏమది, ఏమది?!" అని ఆదుర్దాగా అడిగింది. కొలువులో ఉన్న వాళ్లంతా ఆశ్చర్యంతో నిశ్చేష్టులైపోయారు.



అంతలోనే చిలుకకూడా నెమలి రాజు దగ్గరికి వచ్చి నమస్కరించింది- "ప్రభూ! సింహద్వీపరాజైన మహాబలుడు అకస్మాత్తుగా, కోపకారణం ఏమీ లేకుండానే మనమీదికి యుద్ధానికి తరలివచ్చాడు. తన

సేనల్ని మన నగరం వెలుపల విడిది చేయిస్తున్నాడు. అసలు అతను మన రాజధానికి ఇంత దగ్గరగా వచ్చేంతవరకూ మనవాళ్లకు ఎవ్వరికీ అతని రాక గురించి తెలియనే లేదు! మోహరించి ఉన్న శత్రు సైన్యాన్ని  చూసిన తర్వాత, ఇప్పుడు మన కావలి వాళ్లు యుద్ధ భయంతో వణికిపోతూ, దిక్కు తెలీనట్లు తిరుగుతున్నారు!

ఇందాక కొద్దిసేపటి క్రితం నేను పళ్ల కోసం అడవికి వెళ్ళాను. కోసుకుంటూ, కోసుకుంటూ ముందుగా ఒక చెట్టు కొన కొమ్మ నుండి చూశాను- దూరంగా మిన్నూ-మన్నూ ఏకం చేస్తూ దుమ్ము లేస్తున్నది. దాంతో నా మనసు విపరీతంగా ఆందోళనకు గురవ్వగా, "ఏమిటి, యీ ధూళి?!" అని ఆలోచనలో పడ్డాను.

అంతలోనే కూతవేటు దూరంలో సైన్యాల కలకలం వినబడింది. ఆ వెంటనే బారులు తీరిన సైన్యాలు మన నగరం వైపుకు రావటం కనబడ్డది. అటుగా ఎగిరి వస్తున్న కొంగనొకదాన్ని ఆపితే తెలిసింది- 'మన రాజ్యాన్ని ఆక్రమించేందుకు వస్తున్న సింహళ సైన్యం గురించి. వెంటనే ఆ విషయాన్ని తమరి చెవిన వేసేందుకు పరుగున వచ్చాను" అని వివరంగా చెప్పింది.



అది విని నెమలిరాజు చిత్రవర్ణుడు రౌద్రమూర్తియై లేచింది. కోపంతో ముఖం ఎర్రబడగా తన కొలువులో ఉన్న మంత్రి-సేనా సమూహాన్ని కలయ చూస్తూ- "దూరదర్శీ! నిన్ననో- మొన్ననోనే కదా, మహాబలుడు మన మీద యుద్ధానికి వెడలి వచ్చి, మన చేత చావుదెబ్బ తిని, ఘోర పరాభావం పొంది, సేనల్ని నేలపాలు చేసుకొని, తాను మాత్రం ప్రాణాలు అరచేత పట్టుకొని, సొంత గడ్డకు పారిపోయింది?! దాన్నంతా మరచిపోయి, తనేదో వీర పురుషుడన్నట్లు,

హెచ్చుతగ్గులు చూసుకోకుండా, పొట్టేలు వచ్చి కొండను ఢీకొన్నట్లు, ఏ ముఖం పెట్టుకొని మళ్లీ యుద్ధానికి తరలివచ్చాడు?! చూశావా, అతని కండకావరం?! మనం ఇప్పుడే పోయి ఆ పొగరుమోతును వధించి, సైన్యంతో సహా యమపురికి అతిధిగా పంపుదాం! అడ్డులేని శౌర్యపరాక్రమాలకు నెలవునైన నా ముందు గడ్డిపోచలాంటి యీ పక్షి ఎంతటిది? ఇతని సైన్యం ఏపాటిది?



ముందు మనందరం వెళ్ళి, వచ్చిన ఈ వీర పురుషుల్ని అందరినీ నక్కలకు ఆహారం కానిచ్చి వద్దాం; ఆపైన సింహళ ద్వీపానికి కూడా యుద్ధానికి వెళ్లొద్దాం! యీ సారి అతని రాజధానిని కూకటి వ్రేళ్లతో సహా పెకిలించి, పేరుకి కూడా లేకుండా దాన్ని నేలమట్టం కావించి కానీ తిరిగిరావద్దు!" అన్నది.

అప్పుడు మంత్రి దూరదర్శి లేచి నిలబడి ప్రభువుకు నమస్కరిస్తూ, వినయంగా ఇలా అన్నది- "ప్రభూ! పరిస్థితులు ఇదివరకటి లాగా లేవు. మొన్న హంసరాజుతో జరిగిన యుద్ధంలో పేరు మోసిన వాళ్లు- మనవాళ్ళు అనేక మంది వీర మరణం చెందారు. దాంతో మన సైనికులను గుర్తించి, ముందుకు నడిపి, మన లక్ష్యం నెరవేరేట్లుగా వారి మనసుల్లో ధైర్యాన్ని, శౌర్యాన్ని, బాహుబలాన్నీ మెరిపించి, సైన్యాధ్యక్షత్వాన్ని వహించేందుకు తగినవాళ్ళు, ఏది సరైనదో, ఏదికాదో తెలిసిన విచక్షణ కలవాళ్ళు ఎవ్వరూ నా కంటికి ఇంకా కనబడలేదు. అందువల్ల యీనాడు మన సైనికదళానికి అనేక మంది ప్రభువులైనారు- ఎవరికివాళ్లు నాయకులైనారు ప్రభూ!

ప్రభూ! అన్యథా భావించకండి- సాహసం ఎల్లవేళలా పనికి రాదు. 'ఒకప్పుడు మన చేత

ఓడినవాడే కదా, వీడు ఏపాటి శత్రువు' అనుకొనరాదు. అగ్నిజ్వాలలో కాగిన నీళ్లే పొంగి పడి, ఆ అగ్నిని చల్లార్చుతాయి. బండి చక్రం మాదిరి, కాలగతి వల్ల పరిస్థితులన్నీ క్రిందివి మీదకి, మీదివి క్రిందకి అవుతుంటాయి. చేత్తో విసిరిన బంతిలాగా, యీ భూమి మీదికి వచ్చిన జీవులన్నిటికీ ఇలా హెచ్చుతగ్గులు- క్రింద పడటం, తిరిగి పైకి లేవటం- ఇదంతా సహజం.



దయచేసి "ప్రాణాల మీది తీపితో వీడు ఇలా చెబుతున్నాడు" అనుకోకండి. మేఘం మారికి గొప్పగా గర్జించటం వల్ల కార్యం నెరవేరటం అనేది ఎప్పుడూ జరగదు! మహాత్ములు సావధానంగా, సాధక బాధకాలన్నింటినీ మంత్రులతో చర్చించి, చక్కగా ఆలోచించి, లాభనష్టాలను బాగా బేరీజు వేసుకొని, ఆ తర్వాత గానీ 'ఏంచేయాలి' అనేది నిశ్చయించరు.

రాజు తాను ఎంత బలవంతుడైనాగానీ, అనేక మంది రాజులతో ఒకే మాటు వివాదం పెట్టుకోకూడదు; అట్లా పోట్లాట పెట్టుకుంటే ఖచ్చితంగా నశిస్తాడు- ఇంకేమీ ఉండదు. పాము ఎంత బలమైనదైనా, చలి చీమల చేత చిక్కి చనిపోవటం మనం ఎరుగనిదా? అర్థం లేని విరోధాన్ని సమర్థించకండి- ప్రభువులవారు నా మీద దయ తలచి యుద్ధాన్ని మానండి. 'ఏది సరైనది, ఏది కాదు' అనే విచారణ లేకుండా, కేవలం కోపమే ప్రధానంగా, ఎవరైతే త్వరపడి నిర్ణయం తీసుకుంటారో, అలాంటి వాళ్ళు 'ముంగిసను చంపుకొని ఆనక విచారించిన బ్రాహ్మణుడి మాదిరి, పశ్చాత్తాపానికి గురవుతారు. ప్రభువులవారికి ఆ కథ చెబుతాను, వినండి" అని ఇలా చెప్పసాగింది- (..మిగిలినది మళ్ళీ)





# అమ్మ ప్రేమ

*"అమ్మ ప్రేమ ఎన్నో నేర్పిస్తుంది. అమ్మ ప్రేమను పొందిన ఒక ఆడపిల్ల తన చిన్నతనంలో చదువుకోలేకపోయినా కూడా జీవితంలో ఎంత ఎత్తుకు ఎదిగిందో తెలియజేయడమే నా ఈ కథలోని ముఖ్య ఉద్దేశం" అని రాస్తున్నది వినూత్న. చూడండి..*

*రచన: M. వినూత్న, తొమ్మిదవ తరగతి, తేజ టాలెంట్ స్కూల్, కోదాడ, నల్గొండ జిల్లా.*

*కూర్పు చేర్పులు: కొత్తపల్లి*

అనగనగా ఒక ఊళ్లో ఒక తల్లి, కూతురు నివసించేవాళ్లు. తల్లి పేరు లక్ష్మమ్మ. కూతురు శాంతి. వాళ్లకు ఏ ఆస్తిపాస్తులూ లేవు. శాంతి చిన్నతనంలోనే వాళ్ల నాన్న వాళ్ళను వదిలేసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. భర్త లేడని లక్ష్మమ్మ ధైర్యం కోల్పోలేదు. ఎందరు ఎన్ని రకాలుగా అవమానించినా సరే, తను మాత్రం ఉన్నంతలో చక్కగా బ్రతుక్కోవాలని సంకల్పించుకున్నది. క్రమం తప్పకుండా కూలికి పోయేది. ఒళ్ళు వంచి పని చేసేది. 'లక్ష్మమ్మ వస్తే చూసుకోనక్కర్లేదు' అనుకునేవాళ్ళు

రైతులు. తనకు వచ్చిన కూలిని రెండు భాగాలు చేసేది లక్ష్మమ్మ. ఒక భాగం కుటుంబం గడపడానికి. మరొక భాగం శాంతి భవిష్యత్తుకు.

లక్ష్మమ్మకు కూతురంటే ప్రాణం. శాంతికి కూడా అమ్మ అంటే చాలా ఇష్టం. ఒక రోజున తల్లీకూతుళ్లు ఇద్దరూ పొలం గట్టుమీద నడుస్తున్నారు. ఒకచోట గెనం సన్నగా ఉండింది. కూతురికి తను కింద పడుతానేమోనని భయం వేసి, అమ్మ చేతిని గట్టిగా పట్టుకుంది. లక్ష్మమ్మ ఆ చేతిని వదిలించుకొని, తనే శాంతి చేతిని పట్టుకుంది.

శాంతి ఈ సంగతిని గుర్తించి, గెనం దిగగానే అడిగింది- "అమ్మా నువ్వు నా చేయి పట్టుకున్నా, నేను నీ చేయి పట్టుకున్నా ఒకటే కదా?" అని. లక్ష్మమ్మ నవ్వి, జవాబిచ్చింది "పాపా! మనుషుల్ని జనాల్ని అందరినీ బాగా గమనించు- పిల్లలు పెద్దయ్యాక తల్లిదండ్రుల చేతులు వదిలిపెట్టచ్చు; వాళ్ళని పట్టించుకోకపోవచ్చు గానీ, ఆ తల్లులు మాత్రం పిల్లల చేతులు వదలరు- వాళ్ళకు సాయం చేస్తూనే ఉంటారు" అని. "నేను మాత్రం నీకు సాయం చేస్తూనే ఉంటానమ్మా" అన్నది శాంతి. ఆ పాపకు అర్థమైంది, తల్లికి తనంటే ఎంత ప్రేమో.

ఇట్లా తల్లినుండి జీవితానికి సంబంధించిన విలువల్ని అనేకం నేర్చుకున్నది శాంతి. ఆ క్రమంలోనే ఆ పాపకు తల్లి తనకోసం ఎంత కష్టపడుతున్నదో అర్థమైంది- శాంతికి పదేళ్ళు వచ్చేసరికి, ఆ పాప ఇక బడికి వెళ్లటం మానేసింది. లక్ష్మమ్మ శాంతికి అనేక రకాలుగా చెప్పి చూసింది- బడికి వెళ్ళటం ఎంత అవసరమో. అయినా శాంతి వినలేదు. తల్లితోబాటు కూలికి పోవటం మొదలు పెట్టింది. తన వంతుగా వచ్చిన కూలిని వేరుగా పెట్టుకోసాగింది కూడాను!

రాను రాను లక్ష్మమ్మకు శాంతి భవిష్యత్తు పట్ల బెంగ పట్టుకున్నది. తన జీవితం కూలితో సాగిపోతుంది- కానీ తన బిడ్డ?! శాంతి జీవితం బాగుండాలి. "సొంత పొలం ఉంటే కొంత నయం". అయితే ఆ సరికి ఆమె కూడబెట్టిన డబ్బు చాలానే

అయ్యింది- దానితో ఊరికి దగ్గరగా రెండెకరాల పొలం కొని, సొంత పొలం సాగు చెయ్యటం మొదలుపెట్టింది లక్ష్మమ్మ.

ఇప్పుడు శాంతి తల్లితోబాటు తమ పొలంలోనే పనిచేయసాగింది. లక్ష్మమ్మ తెలివిగా తోటలో కొన్ని కాయగూరలూ, ఆకుకూరలూ, పూల మొక్కలూ, పండ్ల చెట్లూ- ఇట్లా రకరకాల పంటలు సాగు చేసేది. ఆ ఉత్పత్తులను తీసుకెళ్ళి వారం వారం జరిగే సంతలో అమ్ముకొచ్చేది శాంతి. అలా వచ్చిన డబ్బుల్ని తల్లికీ-తనకూ సమానంగా పంచి ఇచ్చేది. లక్ష్మమ్మ తన వాటాలో సగాన్ని ఇంటి ఖర్చులకోసం వాడి, మిగిలిన సగాన్ని శాంతికోసం అదనంగా దాచేది!

ఇట్లా పదేళ్ళు గడిచేసరికి లక్ష్మమ్మ కుటుంబం కొద్దిగా స్థిరపడింది. లక్ష్మమ్మ శాంతికి తన ప్రేమను అందివ్వటంతో పాటు ఎన్నో విలువలను నేర్పింది. అందరితో కలసిమెలసి ఎలా మెలగాలో, అందరికీ ప్రేమను ఎలా పంచాలో నేర్పింది. శాంతికి ఇప్పుడు ఇరవయ్యేళ్ళు వచ్చాయి. పొలంలో పని చేసి, చేసి ఆమె శరీరం బాగా గట్టి పడ్డది. ఇప్పుడు లక్ష్మమ్మకు, ఆమెకు కూడా విశ్రాంతిగా ఉండేందుకు కొద్దిగా సమయం చిక్కుతున్నది.

ఒక రోజున వాళ్ళింటి దగ్గర్లో ఆడుకుంటున్న పిల్లలు కొందరు శాంతిని ఎగతాళి చేశారు. "నువ్వు మాలాగా బడికి వెళ్లలేవు; చదువుకోలేవు. నీకు ఏమీ రాదు, నువ్వు ఏమీ రాయలేవు, చదవలేవు. మేము చూడు ఎంతబాగా చదువుతామో!" అంటూ నవ్వుకున్నారు.



అది విని శాంతి చాలా నొచ్చుకున్నది.

అక్కడే ఉండి అంతా గమనించిన లక్ష్మమ్మ "బాధపడకు శాంతీ, నీకు చదువు పెద్దగా లేకపోయినా ఎన్నో విలువలు తెలుసు;

మంచి-చెడు తెలుసు. ఏదో ఒక రోజున నువ్వు కూడా చదువుకుంటావు- నాకు తెలుసు. నువ్వు గొప్పదానివి అవుతావు శాంతీ! అయినా సమయం అస్సలు మించి పోలేదు. ఇప్పుడైనా చదవటం మొదలు పెట్టు" అని చెప్పింది.

శాంతికి తల్లి మాటలు గొప్ప ప్రేరణనిచ్చాయి. ఊళ్ళో రంగనాధం మాస్టారు మంచి మనిషి అని అందరూ చెప్పుకుంటారు. శాంతి వెళ్ళి ఆయన్ని సాయం చెయ్యమని అడిగింది. "దానిదేముందమ్మా, మొదట నువ్వు పదోతరగతి పరీక్షలు రాయాలి. తర్వాత ఓపెన్ యూనివర్సిటీ ద్వారా డిగ్రీ పరీక్షలు రాయొచ్చు. నువ్వు కృషి చెయ్యి- నేను నీకు సాయం చేస్తాను" అన్నారాయన. శాంతి ఆరోజునే చదువు మొదలు పెట్టింది. సంవత్సరం తిరిగేసరికి పదోతరగతి పరీక్షలు రాసింది. యాభైశాతం మార్కులతో పాసైంది! వెంటనే సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారా డిగ్రీకి కట్టుకున్నది. రామనాధం మాస్టారి సాయంతో చాలా శ్రమించి చదివింది. మొదటి తరగతిలో ఉత్తీర్ణురాలైంది! ఆ వెంటనే జరిగిన రాష్ట్రస్థాయి పరీక్షల్లో పదో ర్యాంకు సంపాదించుకొని, ఆమె "గ్రూప్ 2" ప్రభుత్వ ఆఫీసరుగా ఎంపికైంది. పేపర్లవాళ్ళు ఆమెను ప్రత్యేకంగా అభినందించారు. "కఠిన పరిస్థితులు ఎన్ని ఉన్నా పోరాడి గెల్చిన మహిళ" అని ప్రశంసించారు.

"నాదేం లేదు- ఇదంతా మా అమ్మ గొప్పతనం" అన్నది యంఆర్వో శాంతి. ✷

మామయ్య: ఒరేయ్ బుజ్జీ! నేను నీకు పది చాక్లెట్లు ఇచ్చాననుకో; అందులోంచి నువ్వు చెల్లికి ఐదు ఇచ్చావనుకో. ఇంకా నీ దగ్గర ఎన్ని చాక్లెట్లు ఉంటాయి రా?

బుజ్జి: రెండు ఉంటాయి మామయ్యా!

మామయ్య: ఒరేయ్! నీకు అసలు లెక్కలే రావు! రెండెందుకుంటాయిరా?

బుజ్జి: నాకు లెక్కలు వచ్చు మామయ్యా! చెల్లికే రావు!

*-లలిత, ఎనిమిదవ తరగతి, గుండువారిపల్లె*



# సాన్వి

*రచన: కె. అభిజ్ఞ, పదవ తరగతి, తేజ విద్యాలయ, కోదాడ, నల్గొండ జిల్లా.*
*ముగింపు: కొత్తపల్లి*

వినాయక చవితికి మట్టి విగ్రహం తయారు చేద్దామని, మా నాన్నను బంకమట్టి తీసుకు రమ్మన్నాను. ఆరోజు సాయంత్రమే ఓ పెద్ద బంకమట్టి ముద్ద తీసుకొచ్చాడు మా నాన్న.

మట్టి ముద్దను తొట్టిలో వేసి నీళ్ళు పోస్తుండగా, నా ప్రమేయం లేకుండానే నేను జ్ఞాపకాల అలమారలోకి జారిపోయాను. నా కళ్ళలో గూడుకట్టిన నీళ్ళు మళ్ళీ కరిగి ప్రవహించసాగినై-

*పోయిన వినాయక చవితికి నేను విగ్రహం తయారుచేస్తుంటే సాన్వి నా దగ్గరే ఉండింది...*

నేను మట్టిలో నీళ్ళు పోస్తుంటే నా కాళ్లకు అడ్డం పడి గంతులు వేస్తూ ఉండింది. నేను మట్టి పిసుకుతుంటే ఆ మట్టిని వాసన చూడబోయిందది. 'ఏయ్! మట్టి తింటావా?' అని నేను దాని నోటికి మట్టి రాస్తే 'కుయ్..కుయ్' మని ఏడ్చుకుంటూ

పోయిందదీ!



ఇప్పుడు నేను ఒక్కదాన్నే కూర్చొని విగ్రహం తయారు చేసుకోవాలి. తను లేదు కదా! నన్ను శాశ్వతంగా వదిలి వెళ్లిపోయింది. తను నాతో కలిసి ఉన్నది కొన్ని నెలలేనట.. అయితేనేమి, ఆ నెలల్లోని ప్రతి క్షణం నాకు ఇంకా గుర్తున్నది. గుర్తుకు వస్తూనే ఉన్నది. నా కళ్ళలో నీరు ఇంకా ఇంకిపోలేదు.

"ఇది మరీ వింతగా ఉంది ఒదినా! కుక్క చచ్చిపోయిందని సంవత్సరం నుండి ఏడుస్తోంది ఏంటి, ఈ పిచ్చిది?! మొన్న మా అమ్మ చనిపోతే కూడా నేను ఒక్క చుక్క కన్నీరు కూడా కార్చలేదు. పాడు కుక్క కోసం ఇంత ఏడుపు దేనికి?!" పండగకొచ్చిన మా మేనత్త అడుగుతోంది అమ్మని.

నాకు చాలా ఆవేశం వచ్చింది. వెళ్ళి ఆమెకు 'నోరు మూసుకో' అని చెప్పాలనుకున్నాను. 'ఊరుకుంటావా, లేదా' అని గట్టిగా అరుద్దామనుకున్నాను. అయితే వెంటనే మా అమ్మ మాటలు వినిపించాయి- "దీనిది ప్రేమో, పిచ్చో మనకు అర్థం కాదులే వదినా. ఆ మూగ కుక్కంటే దీనికి ఇంత ఇదేంటో, ఎవ్వరికీ తెలీదు" అని.

నిజమే.. తనంటే నాకు ఎంత 'ఇదో' ఎవ్వరికీ తెలీదు. మా అమ్మకు కూడా పూర్తిగా అర్థం కాలేదు. నేను ఈ పెద్దవాళ్ళతో ఏమీ మాట్లాడదలచుకోలేదు. గబగబా నా గదిలోకి వెళ్ళి మంచం మీద బోర్లా పడిపోయి ఏడ్చాను. ఎప్పుడో ఓసారి వచ్చే మా అత్తయ్యకు నా భావనల లోతు ఎలా అర్థం అవుతుంది?...

తను మా అమ్మకు, అత్తయ్యకు ఉత్త పిచ్చి జంతువులాగ కనిపిస్తుంది- కానీ నావరకూ అది ఎప్పటికీ ప్రత్యేకమే. నాతోబాటు మనసును పంచుకున్న నేస్తం తను. నా

తోడు. నా నీడ- నేను వ్యక్తం చేయలేక-పోయిన భావనల్ని కూడా తను తన భాషలో వ్యక్తీకరించగలిగేది మరి! నా సమస్యలు వేరే ఎవ్వరికీ అర్థం కాకపోయినా, దానికి మాత్రం అర్థమయ్యేవి.

మాకిద్దరికీ ఎప్పుడైనా గొడవైతే, కొంత సేపటికి ముందుగా అదే నా దగ్గరికి వచ్చేది; నా పాదాలను నాకేది-

దోమల్ని పట్టుకునేందుకు గోడలమీదికి అది ఎంత ఎగిరెగిరి దూకేది?! ఆ క్షణం గుర్తుకు రాగానే నవ్వాను.

నాన్న వచ్చినట్లున్నారు. నన్ను పిలుస్తున్నారు ఎందుకో? నాకు వెళ్ళాలని లేదు. "ఏయ్! నాన్న ఏం తెచ్చారో చూడు!" అరుస్తోంది అమ్మ. నాకు చూడాలని లేదు. నిద్ర వస్తోంది నిజానికి.. ఎప్పుడు తెచ్చినా ఏవో పిచ్చి పిచ్చి పళ్ళు తెస్తారు; ఒక్కోసారి ఏ చాక్లెట్లో తెస్తారు. నాకేమీ అక్కర్లేదు...

*నిద్రలో నా సాన్వి వచ్చింది. తన చిట్టి చిట్టి చేతులతో నా బుగ్గలు నిమురుతోంది.* "ఏయ్! ఊరుకో సాన్వీ! నోట్లో చేతులు పెడతారా ఎవరైనా?" సాన్వి వినటం లేదు. నా ముఖాన్ని నాకేందుకు ప్రయత్నిస్తున్నది. దాని శ్వాస నా ముఖానికి తగుల్తోంది. నాకు నవ్వొస్తోంది. ఎంత ఒద్దన్నా ఊరుకోదేమి, ఇది? బొత్తిగా భయం లేని పిల్ల.." అంతలో మెలకువ వచ్చింది... నా ముఖాన్ని నిజంగానే ఏదో నాకుతోంది!

నేను చటుక్కున చేతులు విదిలించాను. దూరంగా పడి 'కుయ్..కుయ్'మంటోంది సాన్వి- *కాదు కాదు- ఇది ఇంకెవరో! నా సాన్వి కాదిది!*

దాన్ని అదిలించాను. బెదిరి బయటికి పరుగెత్తింది. మళ్ళీ వచ్చి దూరంగా నిల్చున్నది. తోక ఊపుతోంది.. ముద్దుగానే ఉంది ఇది.. నాకు నేస్తం అవుతుందేమో.. "ఏయ్!..." అని అరిచి దాని వెంట పడ్డాను. అది ఇల్లంతా తిరిగి తిరిగి పోయి మా నాన్న కాళ్ళకు చుట్టుకున్నది. నేను నవ్వుతూ దాన్ని పట్టుకొని పైకి లేవనెత్తాను.

మా అందరి నవ్వులతో మళ్ళీ ఓసారి ఇల్లంతా పులకరించింది. 



# ఒక అద్భుతమైన కథ

*రచన: ఆకాష్, ఏడవ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

ఒక రోజున నేను సముద్ర తీరాన నడుస్తూ పోతుంటే, అప్పుడే ఒక పెద్ద అల వచ్చింది. ఆ అల పైభాగాన ఎర్రగా మెరుస్తున్న వింత చేప ఒకటి కనిపించింది. అలమీద ఉన్న చేపను చూసి నేను ఆశ్చర్యపోతుండగానే ఎక్కడినుండి ఊడిపడ్డాడో మరి, జాలరివాడొకడు పరుగున వచ్చి, గురిచూసి దాని మీదికి తన వలను విసిరాడు. వల ఎగిరి వెళ్ళి ఆ చేప మీద పడటం నాకు కూడా స్పష్టంగా కనిపించింది- కానీ అంతలోనే ఏమైందో ఏమో, విచిత్రమైన ఆ చేప వలను కూడా లాక్కొని సముద్రంలోకి జారిపోయింది!

"అయ్యో, ఎంత పని ఐపోయిందో..." అని అక్కడే ఇసుక మీద ఏడుస్తూ పడిపోయాడు జాలరివాడు. ఆ సమయంలో సముద్రతీరాన ఉన్నవాళ్లంతా ఓసారి అతని వైపు వింతగా చూసి, మళ్ళీ

పట్టించుకోకుండా ఎవరిదారిన వాళ్ళు పోయారు.

నేను అతని దగ్గరకి పోయి "అబ్బా! ఒక వల పోయిందని అంత ఏడవాలా?" అన్నాను.

"నేను ఏడుస్తున్నది వల పోయిందని కాదు- చేప పోయిందని!" అన్నాడతను గట్టిగా.

నాకు ఇంకా నవ్వు వచ్చింది. "చూడు, ఇక్కడ- ఈ సముద్రంలో ఒక చేప కనపడిందంటే, అలాంటి చేపలు ఇంకా ఎన్నో ఉండి ఉంటాయి కదా, దగ్గర్లోనే?!" అన్నాను.

అతను పైకి లేచి, తన లుంగీకి అంటిన ఇసుకను దులుపుకున్నాడు- "అది కాదు బాబూ! ఈ చేప-...అంటే-" అని ఆగి, కొంచెం సేపు ఆలోచించాడు- "నీకు ఎలా చెబితే అర్థమవుతుంది, చెప్పు?! సరే! ఈ ప్రపంచంలో ఎన్ని రకాల చేపలు ఉన్నాయనుకుంటున్నావు?" అని అడిగాడు.

"సరిగ్గా చెప్పాలంటే కష్టం- కొన్ని వేల కొలది రకాలు ఉంటాయి" అన్నాను తెలివిగా.

"నిజమే. మరి వాటిలో మనుషులు ఎన్ని రకాలని చూసి ఉంటారు అనుకుంటున్నావు?" అన్నాడు ఇసుక దులుపుకుంటూ.

"నాకు తెలిసి, మనుషులు అన్ని రకాల చేపలనీ చూసే ఉంటారు" అన్నాను.

"అయితే రా బాబూ! మా ఇంటికి రా! నీకు ఆశ్చర్యాన్ని కలిగించే సంగతి ఒకటి చూపిస్తాను" అని నా వీపు మీద తట్టి, భుజం మీద చెయ్యి వేసి నడిచాడతను.

రోడ్డు దాకా నడిచాక, నన్ను ఒక కారులో కూర్చోబెట్టాడు-

"అమ్మ బాబోయ్! ఈ చేపలు పట్టే వాడికి కూడా ఇంత మంచి కారు ఉందా!" అని అనుకున్నాను.

"మీరు ఎవరు సర్?" అని అడుగుదామనుకున్నాను; కానీ నా నోట్లోంచి మాట బయటికి పెగిలి రాలేదు. ధైర్యం కూడగట్టుకొని అడగబోయే సరికి-

"సర్! మీరు పనిలో ఉండగా చాలా ఫోన్ కాల్స్ వచ్చాయి. నేను ఒకసారి ఫోన్ లిఫ్ట్ చేసి 'ఎవరు?' అని అడిగితే 'మీ సర్ పనిలోంచి ఇంకా రాలేదా?' అని ఫోన్ కట్ చేసారు" చెప్పాడు డ్రైవర్.

"అవునా! అట్లా అయితే కొంపలు మునిగినట్లే. త్వరగా పోనియ్యి ఇంటికి! చాలా పని ఉంది!" అన్నాడు జాలరివాడు, అతన్ని తొందర పెడుతూ. ఆ హడావిడిలో నేను అడగాలనుకున్న ప్రశ్నను అడగనే లేదు.



చూస్తూ చూస్తూండగానే కారు ఓ పెద్ద గేటు ముందు ఆగింది. గేటు ప్రక్కనున్న వాచ్‌మ్యాన్ చటుక్కున నిలబడి గేటు తెరిచి ఆ చేపలు పట్టే వాడికి సెల్యూట్ చేశాడు. కారు సూటిగా గేటు లోపలికి దూసుకు పోయి, ఒక పెద్ద ద్వారం దగ్గర ఆగింది. మేమిద్దరం కారు దిగగానే డ్రైవరు కారును పార్క్ చేయడానికి తీసుకెళ్ళాడు.

"రా, రాహుల్!" అని ఆ జాలరివాడు బంగళా మెట్లు ఎక్కాడు. అద్దంలాగా మెరుస్తున్న ఆ మెట్లను, ధగధగలాడుతున్న రెయిలింగులను చూసి, నేను ఆశ్చర్యపోయాను. 'ఇతనిది ఇంత పెద్ద ఇల్లా!' అని. ఇంటిలో బండలు వజ్రాల మాదిరి మెరుస్తున్నాయి. తల ఎత్తి చూస్తే పైకప్పు- రకరకాల రంగు రాళ్లతో- బహుశ: నవరత్నాలు కావొచ్చు- తాపడం చేసి ఉంది.

"రా బాబూ, రా!" దగ్గుకుంటూ అన్నాడు జాలరివాడు. నన్ను మేడ మీదికి తీసుకెళ్ళాడు. ఇద్దరం అక్కడ బాల్కనీలో కూర్చున్నాము. చుట్టూతా గొప్ప సముద్రపు దృశ్యం కనిపిస్తున్నది. చల్లటి సముద్రపు గాలి నా ముఖానికి తగులుతున్నది.

"ఆఁ.. ఇప్పుడు నీకు చెబుతాను విను-" అని జాలరివాడు మొదలు పెట్టగానే, "సర్, మంచి నీళ్లు-" అని ఒక పని మనిషి అడిగింది.

"మంచి నీళ్లు వద్దులే, కాని బాబు కోసం జ్యూస్ తే" అన్నాడతను.

"ఇంక చెప్పండి సర్?!" అని నేను అతనికి

గుర్తుచేయబోయాను.

'మాట్లాడద్దు' అని నన్ను వారిస్తూ చెప్పాడతను- "ఒకప్పుడు నేను మామూలు చేపలు పట్టే జాలరిని. ఇవాళ్ళ నేను 'ప్రొఫెసర్ బవిరి'ను. '

పేద జాలరి ఇంత ఎత్తుకు ఎలా ఎదిగాడు?' అని నీకు ఆశ్చర్యం వేయచ్చు. దానికి కారణం ఇవాల్టి రోజున నువ్వు చూసిన చేప- దాని పేరు నేనే పెట్టాను- 'బవిరి'. అవును- నా పేరే!

బవిరి చేపలు నువ్వన్నట్లు సముద్రంలో ఎన్నో లేవు- ప్రపంచంలో ఈరోజున అత్యంత అరుదైన చేప ఏదైనా ఉందంటే అదే. ఆ వింత చేప శరీర నిర్మాణం పూర్తిగా మనిషి శరీర నిర్మాణాన్ని పోలి ఉంటుంది. అవి మనుషులకు ఎంత దగ్గరగా ఉంటాయంటే, వాటి శరీర భాగాలను మనిషి శరీరభాగాలకు ప్రత్యామ్నాయంగా వాడుకోవచ్చు!

నువ్వు ఇవాళ్ళ చూసిన బవిరి జాతి చేప ఒకటి, చాలా సంవత్సరాల క్రితం నాకు దొరికింది. అప్పుడు నేను నీ అంత చిన్న పిల్లవాడిని. అది నా చేతికి అందిన తర్వాత నా జీవితమే మారిపోయింది. ఈ రోజు నా చుట్టూ నువ్వు చూస్తున్న సంపద అంతా బవిరి చలవే.

బవిరి చేపలు ఎన్నడో ఒకసారి తప్ప, మామూలుగా సముద్ర తీరానికి రావు. జాలరుల వలలకు దొరకవు. అయితే వాటికి క్రమం అంటే చాలా ఇష్టం. క్రమం తప్పకుండా పనులు చేసేవాళ్లకు తప్ప, ఇతరులకు కనిపించనుకూడా కనిపించవవి! ఒకసారి బవిరి కనిపిస్తే ఎవరైనా ఇంక ఉండలేరు. 'మళ్ళీ ఎప్పుడు కనిపిస్తుందా?' అని ఎదురు చూస్తారు- ఇప్పుడు నువ్వు ఆ దశలోకే పోబోతున్నావు...

అయితే నేను నీకో జాగ్రత్త చెప్పాలి. బవిరి చేపలకు అనేక అద్భుత శక్తులున్నాయి. అవి తమకు నచ్చిన వాళ్ళను తామే ఎంచుకుంటాయి- మనం ఎంత ఎదురు చూసినా ప్రయోజనం లేదు.. అవి ఇప్పుడు నిన్ను ఎంచుకున్నాయేమో అని నాకు అనిపిస్తున్నది.."

అతను ఇంకా ఏదో చెబుతున్నాడు గానీ నాకు వినిపించటం మానేసింది. నిశ్శబ్దంగా

కదులుతున్న అతని పెదవులూ, ఆశ్చర్యాన్ని రేకెత్తించే అతని సంపదా అన్నీ గిరగిరా తిరగటం మొదలుపెట్టాయి. వాటిని మరింత స్పష్టంగా చూడాలని నేను ఎంత ప్రయత్నించానో నా తల అంత తిరిగింది.

మళ్ళీ మెలకువ వచ్చేసరికి నేను సముద్ర తీరంలో పడి ఉన్నాను. నా చుట్టూ మూగి ఉన్న జనాలను నెట్టుకొని ముందుకి వచ్చారు మా నాన్న- "ఏమైంది రాహుల్?!" అంటూ.

నేను సముద్రంవైపుకు చూపించి 'బవిరి.. బవిరి' అన్నాను గానీ ఎవ్వరికీ ఏమీ అర్థం కాలేదు.

ఆ తర్వాత చాలా రోజుల వరకూ నేను క్రమం తప్పకుండా సముద్రం ఒడ్డుకు వెళ్ళాను. అట్లా వెళ్ళిన ప్రతిసారీ బవిరి చేప కోసం క్రమం తప్పకుండా ఎదురు చూశాను. 'ప్రొఫెసర్ బవిరి' కోసం అన్ని విశ్వవిద్యాలయాల్లోనూ వెతికాను. అతని ఇల్లు కనిపిస్తుందేమోనని సముద్ర తీరం అంతటా పిచ్చి పట్టినట్లు తిరిగాను. 'బవిరి' గురించి ఇంటర్నెట్లో కూడా వెతుకుతూనే ఉన్నాను- ఏమీ లాభం లేకపోయింది. ఇప్పుడు నేను ముసలివాడిని- అయినా ఇంత వరకూ మళ్ళీ ఆ బవిరి నా కంట పడనే లేదు!

నిన్ననే ఎవరో చెప్పారు- 'బవిరి'అంటే భ్రాంతి అని అర్థం ఉందట!

మరి ఇదంతా నా భ్రాంతేనంటారా....?

**రెండుకు ముందు!**

టీచర్: శీనూ! నీకు ఒకటి తెలుసా?

శీను: ఆఁ తెలుసు టీచర్- రెండుకు ముందు వచ్చేదే కదా?!

**ఎవరిగోల వారిది!**

నాన్న: ఒరే చింటూ! ఎందుకురా ఏడుస్తున్నావు?

చింటు: మన ఇంటికి బంధువులు వస్తున్నారు నాన్నా! అందుకని.

నాన్న: బంధువులు ఒట్టి చేతుల్తో రారు- మనకోసం ఏమైనా తెస్తారు; అందుకని మనం ఇంకా సంతోషంగా ఉంటాలి కదరా, ఏడుస్తారా ఎవరైనా?!

చింటు: ఏం తెచ్చినా ఏం లాభం నాన్నా! మనింట్లో ఉన్నవన్నీ వాళ్ళు తినేస్తారు కదా?!

*లలిత, ఎనిమిదవ తరగతి, గుండువారిపల్లె*



# చెట్లు-మనుషులు

*"మీరు కూడా ఏనాడూ చెట్లను నరకద్దండి. చెట్లను ప్రేమిస్తూ, రక్షించాలి- చెట్లే మన జీవనాధారాలు అని గుర్తుపెట్టుకోండి" అంటూ ఈ చిట్టి కథని రాసిందట, హర్షిత. చదివి ఎలా ఉందో చెప్పండి మరి!*
*రచన: హర్షిత, 6 వ తరగతి, కె యన్నార్ స్కూల్, నెల్లూరు. సౌజన్యం: చలపతి రావు గారు.*

అనగనగా ఒక దేశము. ఆ దేశములో ఒక వూరు. ఆ ఊరిలో ఇద్దరు మిత్రులు. వాళ్ళు ఎప్పుడు చాలా మంచిగా ఆలోచిస్తుంటారు.

ఒకసారి వాళ్ళు ఇలా అనుకున్నారు- "మనం మనుషులం గనక, మన కష్టాలను, బాధలను ఇతరులతో పంచుకోగల్గు-తున్నాం. అయితే ఆ అవకాశం ఇతర ప్రాణులకు వేటికీ లేదు కదా? ఉదాహరణకు, చెట్లని మనం ఎంత బాధ పెడుతున్నాం, ఒకసారి ఆలోచించండి- అయినా అవి తమ కష్టాలను వేరే ఎవ్వరితోటీ చెప్పుకోలేకపోతున్నాయి- చూశారా? కాబట్టి మనం చెట్ల కోసం ఏదైనా చెయ్యాలి!" అని.

ఇంక ఆనాడు మొదలుకొని రాత్రనక, పగలనక కష్టపడి చెట్లతో మాట్లాడే

యంత్రాన్ని ఒకదాన్ని కనుగొన్నారు వాళ్ళిద్దరూ. ఒకసారి అది తయారవ్వగానే వాళ్లకు చాలా సంతోషం వేసింది. ఆ యంత్రాన్ని పరీక్షించటం కోసమని అడవి వైపుకు వెళ్లారు. అంతలోనే ఆ యంత్రం పనిచెయ్యటం మొదలుపెట్టింది!



ఆ సమయానికి అక్కడ వున్న చెట్లన్నీ ఏదో సమావేశంలో ఉన్నట్లు అనిపించింది- అన్నీ వేటికవి ఒకేసారి మాట్లాడటం మొదలు పెట్టాయి. వాటి సంభాషణని యంత్రం పూర్తిగా తెలుగులోకి తర్జుమా చేస్తోంది!

"ఈ మనుషులందరూ మనల్ని నాశనం చేస్తున్నారు. ఇంక లాభం లేదు. మనం అందరం కలిసి ఎలాగైనా వీళ్లకి బుద్ధి చెప్పాలి. మనకు ఎక్కువ సమయం కూడా లేదు. రెండు మూడు రోజుల్లో ఏదో ఒకటి తేల్చాల్సిందే' అనుకుంటున్నాయవి!

ఈ మాటలను వింటున్న మిత్రులు ఇద్దరూ నిర్ఘాంత పోయారు. ఏం చెయ్యాలో అర్థం కాలేదు వాళ్ళకు. కొద్దిసేపు మౌనంగా ఉండి, ఆ తర్వాత వెంటనే యంత్రం ద్వారా చెట్లతోటి మాట్లాడటం మొదలు పెట్టారు

పిల్లలు: "చెట్లూ! భయపడకండి! మేము మనుషులం- మేం తయారు చేసిన ఈ యంత్రం ద్వారా మీతో మాట్లాడుతున్నాం- అర్థం అయ్యిందా? మీ మాటల్ని మేము ఈ యంత్రం ద్వారా విన్నాం. నిజమే- మీరు చెప్పింది ముమ్మాటికీ సరైనదే- మనుషులు నిర్దాక్షిణ్యంగా మిమ్మల్ని హింసిస్తున్నారు. చెట్లను నరికివేస్తున్నారు.

కానీ మీరు అనుకుంటున్న దానిలో ఒక చిన్న తప్పు ఉన్నది- గమనించండి. భూమి మీద నివసించే మనుషులు అందరూ మిమ్మల్ని నరికి వేయటం లేదు! కొందరు మిమ్మల్ని ప్రేమించేవాళ్ళూ ఉన్నారు. ఎవరో కొందరు

మనుషులు చేసిన తప్పుకు అందరినీ శిక్షించటం న్యాయమా, మీరే ఆలోచించండి.

మిమ్మల్ని తెగనరికి తమ అవసరాలు తీర్చుకోనేవారే కాదు, ఈ భూమి మీద చెట్లను ప్రేమించి వాటికోసం తమ ప్రాణాలను పణంగా పెట్టేవాళ్ళు కూడా ఉన్నారు. మీ ఆలోచనల్లో వారికి కొంత స్థానం కల్పించండి. మనుషులందరినీ శిక్షించకండి".



"మీరే మనుషులకి జీవనాధారం. మీరు వదిలే ఆక్సిజన్ వల్లనే మనుషులు బ్రతుకగల్గుతున్నారు. మీరు ఇచ్చే పండ్లు, కూరలు, కాయలు, పూలు- ఇవన్నీ మనుషులకు ఆహారాలు. మీ వల్ల కురిసే వర్షాలు మనుషులు త్రాగే నీటికి ఆధారాలు. మీరిచ్చే కలప, వంట చెరుకు, ఔషధాలు లేకపోతే మనుషుల మనుగడ లేదు- ఈ సంగతులు అందరికీ తెలుసు.

అయితే మీకు తెలియాల్సిన రహస్యం ఒకటి ఉన్నది- మనుషులు మీకు జీవనాధారాలు! మీకు కావలసిన కార్బన్ డై ఆక్సైడును మనిషి మీకు అందిస్తున్నాడు. అది మీరు బ్రతకడానికి ఎంతో అవసరం, తెలుసా?

అంతే కాదు- మీరు చిన్నగా ఉన్నప్పుడు మనుషులు మీకు నీరు, ఎరువు తెచ్చి ఇచ్చి కాపాడుతున్నారు. మీరు బలంగా ఎదిగేందుకు దోహదం చేస్తున్నారు. కాబట్టి మమ్మల్ని మన్నించండి. మనుషులందరి గురించీ చెడుగా అనుకోవద్దండి".



"మేం ఇద్దరమూ పెద్ద అయిన తరువాత ఈ

భూమి మీద నివసించే మనుషులందరికీ చెట్ల విలువను తెలియజేస్తాం. ప్రజలందరిలోనూ చైతన్యాన్ని రేపి, మీకు రక్షణ చేకూరేలా చేస్తాం- ఇదే మా ప్రతిజ్ఞ".

వాళ్ల మాటలు విని కొద్ది చెట్లు కొమ్మలు గలగలలాడించి మెచ్చుకున్నాయి. "అవును మీరు చెబుతున్నది నిజమే" అన్నాయి. అక్కడ సమావేశమైన చెట్లన్నీ తమ అభిప్రాయాలను సవరించుకున్నాయి- "మీరు పెద్దయ్యే వరకూ మేం కోపం తెచ్చుకోంలేండి. మిమ్మల్ని అర్థం చేసుకుంటాం" అన్నాయి.

మిత్రులిద్దరూ ఈ సంగతిని అందరికీ చెప్పేందుకు బయలుదేరారు గబగబా.

**పొడుపు కథలు**

1. ఒంటి కన్ను వాడు పరుగు పరుగున కంచె వేస్తాడు. ఎవరు?
2. అన్నదమ్ములు ముగ్గురు-అలుపు లేకుండా తిరుగుతాడు.
3. ఒంటి నాలుకవాడు ఆకాశంలో వేలాడు తాడు, నాలుక లాగితే ఠంగుమంటాడు.
4. దేశాలన్నీ చుట్టేస్తుంది, కానీ దేశంలోకి వెళ్లలేదు.
5. సీలు చేసిన కోటలో అన్నదమ్ములిద్దరు బద్దలు కొడితే బయట పడతారు.
6. ఒంటికాలి సుబ్బన్నకి తల బరువు అయినా తిరుగుతూ గంతులేస్తాడు
7. కడుపునిండా తింటే ఆకాశం లోకి ఎగురుతాడు.

*గౌతమి, ఏడవ తరగతి, Z.P.H.స్కూల్, గుండువారిపల్లె*

సమాధానాలు

1. సూది 2. ఫ్యాన్ 3. గంట 4. ఓడ 5. వేరుశెనగ 6.బొంగరం 7. బెలూన్

టీచర్: సమయపాలన అంటే ఏమిటి చందూ?

చందు: గంట కొట్టగానే క్షణం ఆలస్యం చేయకుండా ఇంటికి వెళ్లిపోవడం టీచర్!

*లలిత, ఎనిమిదవ తరగతి, గుండువారిపల్లె*



# కోతి సమయస్ఫూర్తి

*రచన: జి. సాయి కుమార్, ఏడవ తరగతి, శ్రీ విశ్వ విద్యాలయం, జహీరాబాదు.*

అనగనగా ఒక అడవిలో సింహం ఒకటి ఉండేది. ఒకరోజున దానికి చాలా ఆకలి వేసింది. అట్లా ఆకలితో ఉన్న సింహం తనకు 'తగిన ఆహారం ఏం దొరుకుతుందా' అని అలోచిస్తూ అడవి అంతటా తిరిగింది. దూరంనుండే దాన్ని చూసిన జంతువులన్నీ వేటికవి దాక్కున్నాయి, దాని కంట పడలేదు.

చివరికి మామిడి చెట్టు మీద ఉన్న కోతి ఒకటి కనిపించింది దానికి.

'వేరేవేమీ కనిపించటం లేదు. ఈ పూటకి దీన్ని తిని కడుపునింపుకుందాం' అనుకున్నది సింహం.

'సరే, మరి నాకు చెట్టెక్కటం రాదు కదా, దాన్నే చెట్టు దిగేలా చెయ్యాలి' అని, అది ఒక ఉపాయం ఆలోచించింది.

నేల వైపుకే నిశితంగా చూస్తూ, దేన్నో బాగా పరిశీలిస్తున్నట్లు ఒక్కో కాలునూ ఎంతో జాగ్రత్తగా ఎత్తి ఎత్తి వేస్తూ నడవటం మొదలు పెట్టింది.

'క్రింద ఎవరో కదులుతున్నట్లున్నారే' అని చూసిన కోతికి అడుగులో అడుగు వేసుకుంటూ పోతున్న సింహం కనబడింది. 'ఇదేంటి, ఇట్లా నడుస్తోంది? క్రింద ఏం చూస్తోందసలు? కనీసం పైకి తలెత్తి కూడా చూడటం లేదేమిటి?' అని దానికేసే ఆశ్చర్యంగా చూడసాగింది కోతి.



కొంత సేపటికి సింహం కోతి తనను గమనిస్తున్నదని కనుక్కున్నది. 'ఇదే అవకాశం' అనుకొని అది ఒకసారి పైకి కోతి వైపుకు చూసి, చిరునవ్వు నవ్వి అన్నది- "మిత్రమా! నన్ను చూసి భయపడుతున్నావా? ఇప్పుడింక ఆ అవసరం లేదు. నేను ముసలిదాన్నయినాను. యౌవనంలో ఎన్నో జంతువులను చంపి తిన్నాను, చాలా పాపం మూటగట్టుకున్నాను. ఇప్పుడు నాకు హింస అంటేనే అసహ్యం వేస్తున్నది. అందుకని, నా పాప పరిహారం కోసం తీర్థయాత్రలకు బయలుదేరాను. నా వల్ల ఎవ్వరికీ హాని కలగకూడదని నాకుగా నేను ఈ నియమం పెట్టుకున్నాను- నా కాలి క్రింద పడి కీటకాలు కూడా చావరాదని, ఇలా చూసి చూసి నడవాలని నిశ్చయించుకున్నాను. కాశీ చాలా దూరంలోనే ఉంది- అయినా నా నియమాన్ని మటుకు తప్పేది లేదు" అన్నదది కోతితో.

కోతి దాని మాటలు నమ్మింది. "ఎంత భక్తి, ఎంత శ్రద్ధ, ఎంతటి మార్పు!" అనుకున్నది ముచ్చటగా. "ఇట్లాంటి భక్తులను కాకపోతే వేరే ఎవరిని దర్శించుకుంటాం?" అనుకొని, చెట్టు దిగి వచ్చి, సింహం ముందు నిలబడి, ఎంతో భక్తిగా నమస్కరించింది.

అదే అదననుకున్న సింహం ఒక్కసారిగా దాని మీదికి దూకి, దాన్ని బోర్లా పడేసి, దాని పొట్టమీద కాలు మోపి నిలబడింది. క్రూరంగా నవ్వుతూ, కోర పళ్ళు చూపిస్తూ, నాలుకతో పెదాలను నాక్కుంటున్న

సింహాన్ని చూడగానే కోతికి తను చేసిన తప్పు అర్థమైంది. 'క్రూరజంతువుల్ని ఏనాటికీ నమ్మకూడదు' అని వాళ్ళ అమ్మ ఎంత గట్టిగా చెప్పిందో గుర్తొచ్చి, దానికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అయితే అది తెలివైనది కదా, వెంటనే తమాయించుకున్నది. గట్టిగా, పడి పడి నవ్వటం మొదలెట్టింది.



"ఇంకొద్ది సేపట్లో నీకు చావు తప్పదు. ఏడవటానికి బదులు ఎందుకు, నవ్వుతున్నావు?" అడిగింది సింహం అనుమానంగా.

"పూర్వం నీలాంటి తెలివి తక్కువ సింహం ఒకటి ఇలాగే ఓ కోతిని చంపి తినాలనుకున్నదట" చెప్తూ చెప్తూ నవ్వ సాగింది కోతి. "అప్పుడు దాని పరిస్థితి ఎలా అయ్యిందో తలచుకుంటే నవ్వు ఆగట్లేదు. మరీ ఇంత ఇదిగానా?" అని మళ్ళీ మళ్ళీ నవ్వసాగింది కోతి.

"ఏమైందట, దానికి?" అడిగింది సింహం కరకుగా.

"అబ్బ...ఉహ్హుహ్హుహ్హు.." అని మళ్ళీ పడి పడి నవ్వింది కోతి. నువ్వు నా పొట్ట మీద కాలు పెట్టి నొక్కుకుంటూంటే ఎట్లా చెప్పను- ఆయాసంగా ఉంది. కాలు కాస్త ప్రక్కకు తియ్" అంటూ సింహం కాలును పక్కకు నెట్టింది కోతి. అదేమిటో వినాలనే ఆత్రుతలో ఉన్న సింహం కూడా అదాటున కాలును ప్రక్కకు జరిపింది.

అంతే- కోతి ఒక్కసారి ఎగిరి గంతేసి చెట్టు మీదికి పారిపోయింది!

పారిపోతూ పారిపోతూ "ఇప్పుడేం జరిగిందో అదే జరిగిందిలేమ్మా!" అని సింహాన్ని వెక్కిరించింది!





# బంగారు పుచ్చకాయ

*రచన: క్షితిజ, బాలాజి, ఆరవ తరగతి, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

అయ్యన్నగారిపల్లిలో ఇరుగు పొరుగున నివసించే రాము, సోములకు చాలానే తేడాలుండేవి. రాము ధనవంతుడు- కానీ చెడ్డవాడు, మూర్ఖుడు. ఊళ్ళోవాళ్లందరూ రాము ఎంత పిసినారో చెప్పుకొని నవ్వుకునేవాళ్ళు.

మరి ఇక సోము ఏమో, పేదవాడు- కానీ మంచి గుణవంతుడు, బుద్ధిమంతుడు. ఊళ్ళోవాళ్ళందరికీ ఏ అవసరం వచ్చినా సాయానికి ముందుండేవాడు.

ఒకసారి దేవుడు ఒక బాటసారి రూపంలో ఆ ఊరికి వచ్చాడు. పాపం, ప్రపంచం అంతా నడిచి నడిచి వచ్చాడేమో, బాగా అలసిపోయాడు.

'ఈరోజు రాత్రికి ఎక్కడ ఆగచ్చు?' అని చుట్టూ చూసే సరికి, ఎదురుగానే రాము వాళ్ళ ఇల్లు కనబడ్డది. "వీళ్ళ ఇల్లు బాగుంది- పెద్దగా, విశాలంగా. విశ్రాంతి తీసుకునేందుకు ఇక్కడైతే చోటు బాగుంటుంది" అని ఆయన రాము వాళ్ల

ఇంటి తలుపు తట్టాడు.

రాము వాళ్ళు సాయంత్రం తొందరగా అన్నం తినేస్తారు. ఇంట్లో దీపాలు వెలిగిస్తే కరెంటు ఖర్చవుతుందని, వీలైనంత వరకు చీకట్లోనే ఉంటారు. ఇంట్లో రకరకాల విలువైన వస్తువులు, వెండి బంగారాలు దాచి ఉంటారు గనక, వాళ్ళకు సహజంగానే క్రొత్తవాళ్లంటే చాలా భయం.



దేవుడు తలుపు తట్టేసరికి రాము తలుపు దగ్గరికి వచ్చి "ఎవరది?! ఏం కావాలి?!" అన్నాడు కోపంగా.

"నాపేరు 'శివ' అండీ! ఉదయాన్న అనగా బయలుదేరాను మా ఊరినుండి; నడిచి నడిచి చాలా అలసిపోయాను. మీ ఇంటి లోగిలిలో తలదాచుకునేందుకు తావు ఇవ్వగలరా, దయచేసి? కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని తెల్లవారగానే వెళ్ళిపోతాను?!" అడిగాడు దేవుడు.

రాముకి అది అస్సలు ఇష్టం కాలేదు. 'చూడయ్యా! నువ్వెవరో నాకు తెలీదు. నువ్వు దొంగవే అయ్యుండచ్చు. దొంగలించటం కోసమే నా ఇంట్లో దూరుతుండచ్చు. నేను ఎట్లా కనుక్కునేది? నావల్ల కాదు; నాకంత సమయమూ లేదు. మరీ అంత పిచ్చోడిని కాదు గద- నీకు అంతగా కావాలంటే ఏ చెట్టు క్రిందనో పడుకోవచ్చు; ఇళ్ళ దగ్గరే పడుకోవాలని ఏమున్నది? పోయి దూరంగా ఆ చెట్టు క్రింద పడుకో!" అన్నాడు.

"సరేలెండి. పర్లేదు లేండి. మీకు నేను తెలీదుగా, నిజమే" అనేసి దేవుడు రాము దగ్గర సెలవు పుచ్చుకొని, నేరుగా సోము వాళ్ళింటి తలుపు తట్టాడు. సోము తలుపు తీసి "ఎవరు కావాలండీ?!" అని అడిగాడు.

"నా పేరు శివ అండీ. నేను ఒక బాటసారిని. చాలా దూరం నుండి వస్తున్నాను; నడిచి నడిచి అలసిపోయాను. మీ ఇంటి అరుగు మీద కొంచెం సేపు విశ్రాంతి తీసుకోవచ్చా, రేపు తెల్లవారగానే వెళ్ళిపోతాను" అడిగాడు దేవుడు.



"ఓఁ దానిదేమున్నది, మీరు పడుకుంటే మా అరుగులు ఏమీ అరిగిపోవు. అయినా మీరు బయట పడుకోనక్కర్లేదు- మాతోబాటు మా ఇంట్లోనే పడుకోవచ్చు. కానీ ఏమంటే, మరి మేం ఏమంత ఉన్నవాళ్లం కాదు- మీకు పెట్టేందుకు సరిపడ అన్నం కూడా లేదేమో మరి... చూస్తాను. ముందయితే లోపలికి రండి, కాళ్ళు చేతులు కడుక్కోండి" అన్నాడు సోము, అతన్ని లోనికి ఆహ్వానిస్తూ.

"ధన్యవాదాలు స్వామీ! మీ మంచితనంతోటే నా కడుపు నిండింది. నాకు ఇంక వేరే భోజనమేమీ అవసరం లేదు" అన్నాడు దేవుడు మొహమాట పడుతున్నట్లు.

"అట్లా పస్తుండక్కర్లేదు లెండి- ఏదో మా ఇంట్లో ఉన్నంత తిందురు" అని ఆరోజు మిగిలిన అన్నమూ, ఊరగాయతో భోజనం పెట్టాడు సోము.

దేవుడు మరునాడు ఉదయాన వెళ్తూ వెళ్తూ- "ధన్యవాదాలు సోమూ! నువ్వు చాలా మంచివాడివి. ఆకలిగొన్న నాకు అడక్కనే భోజనం కూడా పెట్టావు. నీకు ఏదైనా ఇవ్వాలని ఉంది- ఇదిగో, ఈ పుచ్చకాయ విత్తనం తీసుకో. దీనిని మీ ఇంటి వెనక తోటలో నాటు. బాగా పెరుగుతుంది. నీకు మేలు జరుగుతుంది" అని ఆశీర్వదించి వెళ్లిపోయాడు.

సోము చాలా కాలంగా మంచి పుచ్చకాయ విత్తనాలకోసం వెతుకుతున్నాడు. 'ఇది కూడా బానే ఉంది. దేవుడిచ్చిన విత్తనం!"

అని, అతను ఆ విత్తనాన్ని పెరట్లో నాటాడు.

మరునాటికల్లా అక్కడో మొలక బయటికి వచ్చింది. సాయంత్రం కల్లా అది తీగ వేసి పారింది. మరుసటి రోజుకొక వింత పిందె వేసింది. మూడోరోజుకల్లా అక్కడో బంగారు పుచ్చకాయ కాసింది! నిజంగానే ఆ పుచ్చకాయంతా మేలిమి బంగారం! దాని లోపల నిండా వజ్రాలూ, మణులూ, మాణిక్యాలూ ఉన్నాయి!

సోముకు చాలా సంతోషం వేసింది. అతను వాటిని వెలకట్టేందుకు పట్నంలో ఉన్న వ్యాపారి దగ్గరికి తీసుకెళ్ళాడు. ఒక్కొక్క మణీ లక్షలాది రూపాయలు చేస్తుంది! వాటిలోంచి సోమయ్య కేవలం ఒక చిన్న వజ్రాన్ని మటుకు అమ్మి, మిగతావి పట్టుకొని సంతోషంగా ఇంటికి వచ్చాడు.

ఆలోగా అతని పెరట్లోని పుచ్చకాయ మొక్క మరొక పిందె వేసింది. అయితే ఈ సంగతి ఎలా తెలిసిందో, రాముకి తెలిసింది. "అయ్యో! ఆ బాటసారిగాడిని నేనే ఇంట్లోకి పిలుచుకొని ఉంటే ఎంత బాగుండేది! ఇవన్నీ పూర్తిగా నావే అగును గదా" అని అతనికి ఎక్కడలేని ఏడుపూ వచ్చింది.

"ఏమైనా గానీ! ఈ పుచ్చకాయలకు అసలు హక్కుదారుడిని నేనే- సోమయ్య కాదు!" అని అతను రాత్రికి రాత్రి సోమయ్య ఇంట్లో దూరి, తీగకు ఉన్న పుచ్చకాయని దొంగతనంగా కోసుకు పోయాడు.



కానీ మరునాటి ఉదయానికి చూస్తే అది కాస్తా కుళ్ళిపోయి ఉన్నది!

నిరాశగా చూస్తున్న రాముతో పుచ్చకాయ మాట్లాడింది: "నువ్వు చాలా చెడ్డవాడివి రామూ! ఇతరులకు ఉపయోగపడే పని ఏదీ చేయటం నీకు అస్సలు ఇష్టం లేదు. ఎవరినైనా మీ ఇంటి అరుగుమీద పడుకోనిస్తే నీదేం పోతుంది?" అన్నది. 




# తల్లి సాహసం

*కథ: యం.డి. షైబాజ్, ఏడవ తరగతి, శ్రీ విశ్వభారతి విద్యాలయం, జహీరాబాదు*
*కథనం: కొత్తపల్లి*

మాతలుంగ రాజ్యపు రాజు యశోవర్ధనుడు చాలా దయగల రాజు. యుద్ధాలంటే ఆయనకు అస్సలు గిట్టేది కాదు- ఎందుకంటే ఆయనకు తెలుసు- యుద్ధాలు అనేకమంది అమాయకుల ప్రాణాలను బలిగొంటాయి. ఎన్నో కుటుంబాలు నాశనం అవుతాయి. అయితే ఆయన మంచితనాన్ని బలహీనతగా ఎంచుకొని వేరే ఎవరైనా రాజులు మాతలుంగ మీదికి దండెత్తే అవకాశం ఉన్నది. "అలా జరగకుండా ఏం చేయాలి?" అని మంత్రులతో బాగా ఆలోచించిన మీదట, ఆయన తన కోట చుట్టూ చాలా పెద్ద, ఎత్తైన గోడ ఒకటి కట్టించాలని నిర్ణయించాడు.

కోట చుట్టూ గోడ లాంటిది ఒకటి ఇప్పటికే ఉన్నది. అయితే అది బాగా శిధిలం

అయిపోయింది. ఇప్పుడు దాన్ని బలోపేతం చేసి, అలాగే దాని లావునూ ఎత్తునూ మరింతగా పెంచాల్సి ఉన్నది. ఇలా కోటగోడను పునర్నిర్మించటం అన్నది ఏమంత సులభమైన పని కాదు. ఏమంటే, మాతలుంగ రాజ్యంలో సగభాగం నిజానికి కోటలోనే ఉంది- మిగిలిన సగం కోటకు బయట. ఈ రెండు ప్రాంతాల్లో నివసించే ప్రజల్నీ వేరు చేయటం కొంచెం కష్టమే.

అయినా రాజుగారు తలచుకుంటే కానిదేమున్నది? కోటగోడ తయారు కాసాగింది. ఎక్కడికక్కడ ఎత్తైన కట్టడాలు లేచాయి. కోటలోంచి బయటికీ, లోపలికీ తిరగటం మీద ఆంక్షలు విధించబడ్డాయి. నిర్ణీత సమయాల్లో మాత్రమే అటునుండి ఇటు, ఇటు నుండి అటు ప్రజల్ని రానిస్తారు. ఆయా ప్రాంతాల్లో ఉండే కోట ద్వారాల వద్ద సైనికులు నిలబడి, వచ్చే పోయే వారిని పరిశీలిస్తుంటారు.

కోట గోడకు అవతల పహాడీ అనే చిన్న పల్లె ఒకటి ఉండేది. పహాడీలో త్రాగు నీటి ఎద్దడి అధికంగా ఉండేది. అక్కడి ప్రజలంతా త్రాగునీటి కోసం కోట లోపల ఉన్న బావిపైనే ఆధారపడేవాళ్ళు. ఆ చుట్టు ప్రక్కల పాతగోడ పూర్తిగా శిధిలం అయి ఉండటంతో, ఇన్నాళ్ళూ కోటలోకి వచ్చి పోయేందుకు అది ఊరి జనాలకు బాగా అనువుగా ఉండేది. కూలిన ఆ గోడ గుండానే ప్రజలు కోటలోకి వచ్చి నీళ్లను తీసుకెళ్లేవారు. అయితే ఇప్పుడు ఆ వీలు లేదు- ఎత్తైన కోట గోడలు ఊరివాళ్ళను, కోటను వేరు చేయసాగాయి. వాళ్ళు ఇప్పుడు తమ ఇష్టం వచ్చినట్లు లోనికి- బయటికి తిరిగే వీలు లేదు..

ఆరోజు సాయంత్రం కోట ద్వారాలు మూసి వేస్తున్న సమయానికి, పహాడీలో నివసించే ఒక యువతి, ఖాళీ బిందెని ఒకదాన్ని పట్టుకొని పరుగు పరుగున కోటలోనికి రాబోయింది. బరువైన కోట తలుపులను సైనికులు ఆ సరికే కదిల్చి ఉన్నారు- వాటిని మరునాటి ఉదయం వరకూ ఇక తెరువరు. సైనికుడు ఒకడు ఆమెను లోనికి పోకుండా అడ్డుకున్నాడు. ఆమె అతన్ని ప్రాధేయపడింది- "అయ్యా! కరుణించండి!

ఇంట్లో ఒక్క చుక్క నీళ్ళు లేవు. కనీసం ఈ బిందెడు నీళ్ళు తీసుకుపోతే మాకు ఈరోజు వంట కుదురుతుంది. లేదంటే మేమూ, మా పిల్లాడూ దాహానికి మాడాల్సిందే. దయచేసి లోనికి పోనివ్వండి- ఒక్క క్షణంలో తిరిగి వచ్చేస్తాను" అని.

"చూడమ్మా! నియమాలు నియమాలే. నిన్ను లోనికి పోనివ్వగలం. కానీ కోట తలుపులు మూసే సమయం అయిపోయింది. ఇప్పుడు తలుపులు మూసేశామంటే ఇక మేమెవ్వరం ఉండం. రేపు తెల్లవారు జామున మళ్ళీ వచ్చి తలుపులు తెరుస్తాం. నువ్వు నీళ్ళు తీసుకొని వెనక్కి ఎట్లా వస్తావు? కుదరదు. అందుకని, మా మాట విని వెనక్కి వెళ్ళిపో. నీళ్ళు రేపు ఉదయాన్న తెచ్చుకోవచ్చులే" అన్నారు.

ఆమె పట్టు వదల్లేదు. "నన్ను ఇప్పుడు లోనికైతే పోనివ్వండి- బయటికి వచ్చేది మళ్ళీ చూసుకుందాం" అని ప్రాధేయపడింది సైనికులను. సైనికులు ఆమెని కోటలోపలికి రానిచ్చి, ద్వారాలు మూసి, తమ దారిన తాము వెళ్ళారు.

మరునాడూ ఇలాగే జరిగింది. సరిగ్గా వీళ్ళు ద్వారం మూసే సమయానికి ఆమె రావటం, కోటలోపలికి వెళ్ళాలని పట్టుపట్టటం, వీళ్ళు ఆమెని లోనికి వదిలి కోట తలుపులు మూసేయటం.

మూడవరోజూ ఇదే జరిగే సరికి సైనికులకు అనుమానం వచ్చింది- "రోజూ కోట ద్వారం మూసే సమయానికి ఈమె లోనికి పోతున్నదే, మరి బయటికి ఎలా వస్తున్నది?" వెంటనే వాళ్ళు ఆమెని బంధించి రాజుగారి ముందు ప్రవేశ పెట్టారు. "మహా ప్రభూ! ఈ యువతి మూడు రోజులుగా ప్రతిరోజూ సాయంత్రం కోట ద్వారాలు మూసేసే సమయానికి లోనికి పోతున్నది. బయటికి ఎలా వస్తున్నదో తెలీటం లేదు ప్రభూ. ఇందులో ఏదో మోసం ఉన్నది. తమరు ఈమెను విచారించాలి" అని.

రాజుగారు ఆమెని అడిగారు: "ఏం తల్లీ! కోటలోకి ఎందుకు వస్తున్నావు, రోజూ?"

"మా ఊరు పహాడీలో నీళ్ళు లేవు ప్రభూ! మా ఊరివాళ్లం అందరం కోటలోని బావి నీళ్ళనే వాడతాం"

"మరి రోజూ ఆలస్యంగా ఎందుకు వస్తున్నావు?"

"నాకో చిన్న కొడుకు ఉన్నాడు ప్రభూ. పాలు త్రాగే పసిబిడ్డ. ఏ రోజునైనా వాడు నిద్రపోయేంత వరకూ నేను బయటికి రావటం కుదరదు"



"మరి నువ్వు లేకుండా వాడు రాత్రంతా ఎలా ఉంటాడు?"

"ఉండడు ప్రభూ! అందుకనే నేను నీళ్ళు తోడుకున్న వెంటనే గబగబా మళ్ళీ ఇల్లు చేరుకుంటాను"

"ఎట్లా వెళ్తావు, కోట ద్వారం మూసేసి ఉంటుంది గదా?"

"అది కొంచెం సమస్యే ప్రభూ" కొంచెం చిన్నబోయిందామె. తిరిగి చెప్పింది- "అందుకనే నేను గోడ దూకి ఇల్లు చేరుకుంటాను రోజూ"

రాజుగారు ఆశ్చర్యపోయారు- "గోడ దూకుతావా? ఎలాగ? ఇంత పెద్ద గోడను నువ్వు ఎట్లా దూకుతున్నావు? గోడకు ఎక్కడైనా రంధ్రం ఉందా?"

"గోడకు రంధ్రం ఏమీ లేదు ప్రభూ! కానీ తన బిడ్డను కలవగోరే తల్లిని ఏ కోటగోడలు మటుకు ఆపుతాయి?" కొంచెం తీవ్రంగానే అడిగింది ఆ యువతి.

రాజుగారు ఒక్క క్షణం నిర్ఘాంతపోయారు. ఆపైన ఆమెను విడుదల చేసి, "నువ్వు వెళ్ళచ్చు" అన్నారు. "-కానీ నువ్వు గోడను ఎట్లా దూకుతావో చూడాలని ఉంది నాకు"

రాజుగారు, పరివారం చూస్తుండగా ఆమె కొత్తగా కట్టిన గోడను అవలీలగా ఎక్కి అవతలి వైపుకు దూకింది. దూకేందుకు మరి ఆమె దగ్గర మరే ఇతర సాధనాలూ లేవు!

"ప్రభూ! గోడ ఎత్తును ఏమైనా

పెంచుదామంటారా..?" రాజశిల్పి అడిగాడు ముఖం చిన్న బుచ్చుకుని.

"-ఏమీ అవసరం లేదు. ముందు ఆ తల్లిని అభినందిస్తూ మా తరపున ప్రత్యేక బహుమానాన్ని పంపండి. ఆవిడ నా కళ్ళకు కమ్మిన పొరను తొలగించింది" అన్నారు రాజుగారు చిరునవ్వుతో.

అటుపైన ఆయన రెట్టించిన ఉత్సాహంతో పని చేశారు. కోటగోడలకు అవతల ఉన్న గ్రామాలన్నిటి నీటి సమస్యలూ తీరేటట్లు ఊరూరా బావులు త్రవ్వించారు; చెరువుల నిర్మాణం చేపట్టారు.

కోట గోడకు ద్వారాలున్న చోటునల్లా సైనికులు ఇరవైనాలుగు గంటలూ కాపలా ఉండేట్లు, ప్రజలకు- ప్రత్యేకించి తల్లులకు- ఎలాంటి అసౌకర్యమూ కలగకుండా ప్రవర్తించేట్లు ఆదేశాలు జారీ చేశారు!

**తెలుగు జాతి:**

తెలుగు జాతి పిల్లలం
తెలుగు గడ్డ పిల్లలం
తెలుగు జాతి గొప్పదని
వెలుగెత్తి చాటుదాం
తెలుగు జాతి ఘన కీర్తి
నలమూలల చాటుదాం
తెలుగుభాష తియ్యనిదని
తెలుగుజాతి మధురమని
తియ్యనైన భాష
తెలుగు భాషని
గొంతెత్తి పాడుదాం

*c.గిరీష్, ఎనిమిదవ తరగతి, pvrzphs, గుండువారిపల్లె*

**ఇద్దరు విద్యార్థుల పోటీ...**

మొదటి విద్యార్థి: నీకు మానవ శరీరం గురించి అంతా తెలుసన్నావు కదా! నిన్నో ప్రశ్న అడుగుతాను జవాబు చెప్పు.

రెండవ విద్యార్థి: నువ్వేదడిగినా 'ఠకీ ఠకీ' మని చెప్పేస్తా.. అడుగు..

మొదటి విద్యార్థి: మన తలపై ఎన్ని వెంట్రుకలుంటాయి?

రెండవ విద్యార్థి: ఆ ఇదేంటి.. సరేలే..' ఠకీ ఠకీ'.

మొదటి విద్యార్థి: ఏంటిరా, జవాబు తెలీదా, "ఠకీ ఠకీ" అని గుటకలేస్తున్నావ్...

రెండవ విద్యార్థి: రే..! ఇవి గుటకలు కాదురా...చెప్పాను కదరా,'ఠకీ ఠకీ' మని ఆన్సర్ చెప్తానని..

*చదువుల క్రాంతి, ఇంటర్మీడియట్, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా*



# సాహస కార్యం!

*రచన: నవ్య, రిషీవ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

అది ఏమిటో, ఎక్కడినుంచి వచ్చిందో తెలియదు..

అందరం భయంతో, ఆశ్చర్యంతో దానికేసే చూస్తున్నాం నిశ్శబ్దంగా.

పిల్లలం అందరం పిక్నిక్ కోసం నాగసముద్రం చెరువుకు వెళ్ళాం. చెరువు నిజంగా సముద్రం లాగానే అనంతంగా ఉంది. నీళ్ళు ఎక్కడ అంతమవుతున్నాయో కనిపించటమే లేదు. దానికి తోడు బాగా దట్టంగా మబ్బులు క్రమ్మినై. నల్లటి మేఘాలు ఆకాశాన్ని మూసేసేటప్పటికి వాతావరణం అంతా చల్లగా, తేమగా ఒక రకంగా అయ్యింది. పిల్లల చాలా మంది స్నానాలు చేసేశారు. మేం కొందరం పెద్ద పిల్లలం మటుకు ఇంకా నీళ్ళలోనే నిలబడి, దూకి, ఈత కొట్టి ఆటలాడుతున్నాం. ఆ సమయంలో జరిగిందది. ఓ పెద్ద-సొరచేపనా..? -తిమింగలం అంటే అదేనేమో

మరి- మొత్తానికి మేమెవ్వరం ఏనాడూ చూడనంత పెద్ద చేప!- వచ్చి పిల్లల ఎదురుగా నిలబడి పెద్ద కొండ గుహ లాంటి తన నోరును తెరిచింది. సాయంత్రపు వెలుగులో దాని కోర పళ్ళు తళతళా మెరిసాయి.

పిల్లలు అట్లా చూస్తూ చూస్తుండగానే. హఠాత్తుగా ఆ చేప చాలా చాలా పెద్దగా పెరిగిపోయింది! దాని నోరు మరింత పెద్దదైంది. పిల్లలు ఎక్కడి వాళ్ళు అక్కడే శిలా విగ్రహాలలాగా నిలబడి పోయారు. చిన్నపిల్లలందరూ భయంతో గట్టిగా ఏడవటం మొదలుపెట్టారు. ఆ చేపకు ఉన్న కళ్ళు ఎర్రగా మెరవటం మొదలుపెట్టాయి. దాని నోట్లోంచే కావచ్చు, ఒక విపరీతమైన దుర్వాసన మొదలైంది.

అందరికంటే ముందు తేరుకున్న నేను గట్టిగా అరిచాను. "అందరూ వెనక్కి తిరిగి పరుగు పెట్టండి. గబగబా! ఎవ్వరూ నీటికి దగ్గర్లో ఉండకండి! గట్టెక్కండి, త్వరగా పరుగెత్తాలి. రన్!" అని.

పిల్లలందరూ ఒక్కసారిగా వెనుతిరిగి పరుగు పెట్టాం. చేప వేగంగా మమ్మల్ని వెంబడిస్తూ నీటి అంచు వరకూ వచ్చింది. అయితే ఆ సరికే పిల్లలందరమూ బురద-ఇసకలో దానికి అందనంత దూరం పరుగుపెట్టాం. ఆ మధ్యలో నాకు ఒక్క క్షణం పాటు అనుమానం వచ్చింది- "అది నీళ్ళలోంచి బయటికి రాదు కదా" అని. అయితే అదృష్టవశాత్తు అది నీళ్ళ అంచునే ఆగిపోయి, భయంకరంగా బుసకొట్టి, గట్టిగా గాలిని, నీళ్లను చిమ్మింది మాపైకి. ఆ గలీజు వాసనకి పిల్లలందరం కొంతసేపు ముక్కులు మూసుకోవాల్సి వచ్చింది.

అయితే మేం ఎవ్వరం అందలేదని దానికి చాలా కోపం వచ్చినట్లుంది. అది మెరుపులాగా చెరువులో అంతటా తిరుగుతూ కనిపించిన చేపనల్లా తినేసింది. దాని తాకిడికి అప్పటివరకూ తేటగా ఉన్న చెరువునీళ్లన్నీ బురద బురదగా తయారయ్యాయి. అంతలో చెరువుకు అటువైపు నుంచి మేం ఉన్న వైపుకు మరపడవ ఒకటి రాసాగింది. దానినిండా జంతువులు, ప్రయాణీకులు కనిపిస్తున్నారు.

కొందరు పిల్లలు కూడా ఉన్నారు ఆ పడవలో. మేం చాలా కంగారు పడి, గట్టు పైనుండి చేతులు ఊపుతూ అరిచాం- "వెనక్కి వెళ్ళిపోండి! ఇటు రాకండి! సొరచేప!" అని. అయితే మా మాటలు వాళ్ళకు వినబడ్డట్లు లేదు- సొరచేప అటు వైపుకు తిరిగి గబగబా ఆ పడవ మీదికి ఉరికింది. మరుక్షణాన అది పడవ క్రిందికి చేరుకొని దాన్ని తిరగ త్రిప్పి పడేసింది! పడవలో ఉన్న ప్రయాణీకులందరూ మునిగిపోతున్నారు- కొందరు సహాయం కోసం గట్టిగా అరుస్తున్నారు.

గట్టున నిలబడి చూస్తున్న కొద్దీ నాకు చాలా ఆవేశం వచ్చింది. కానీ ఏమి చేయాలో తెలీలేదు- ప్రయాణీకులను కాపాడాలి. అయితే సొరచేపని ఆపకుండా ఎవ్వరూ నీళ్లలో అడుగు పెట్టలేరు..ముందు దాన్ని ఏదైనా చెయ్యాలి.. ఏం చెయ్యాలి?

సొరచేపకేసి చూస్తుంటే నాకొక ఆలోచన వచ్చింది. దాని తలమీద మెరుస్తూ వజ్రం లాంటిది ఒకటి ఉన్నది. అది కదులుతున్న తీరును చూస్తే "దీని ప్రాణం ఈ వజ్రంలోనే ఉంది" అనిపించింది నాకు. "నేను ఈ చేప సంగతి చూస్తాను. మీలో ఈత వచ్చిన పెద్ద పిల్లలు చెరువులోకి దూకి తలా ఒక్క ప్రయాణీకుడినీ కాపాడి గట్టు చేర్చగలరేమో చూడండి" అని అరిచి నీళ్ళలోకి దూకేశాను. వేగంగా ఈదుకుంటూ పడవ దగ్గరికి పోబోయాను- నాకు తెలుసు- చేప మధ్యలోనే నన్ను అడ్డుకుంటుందని.



హటాత్తుగా నా క్రిందినుండి పైకి లేచింది చేప! నన్ను ఒక్కసారిగా ఎత్తి ఆకాశంలోకి విసిరేసినట్లయింది. నా కళ్ళు గిరగిరా తిరిగాయి. అయితే నేను తిరిగి దాని వీపు

మీదనే దబ్బున పడ్డాను. అది నీళ్ళలోనే గిరగిరా తిరుగుతున్నది. అల్లకల్లోలం చేస్తున్నది. నేను క్రింద పడకుండా దాని మొప్పలనొకదాన్ని పట్టుకొని ఊగులాడాను కొంత సేపు. ఆ తర్వాత ఊపిరి బిగబట్టి అక్కడినుండి ఎగిరి నేరుగా దాని తలమీద వాలి, అక్కడున్న వజ్రాన్ని పట్టుకున్నాను. చేప నన్ను వదిలించుకునేందుకు గింగిరాలు కొట్టింది. అయితే నేను ధైర్యంగా నా తల పిన్నుతో వజ్రాన్ని అన్ని వైపులనుండి పొడిచి పొడిచి పెకిలించాను. అస్తమిస్తున్న సూర్యుడి కిరణాలు ఆ వజ్రం మీద పడి తిరిగి నా మీదికి ప్రతిఫలించాయి. నిజంగానే చేపకది ప్రాణం అనుకుంటాను. నేను ఇటు వజ్రాన్ని పెకిలించానో లేదో, అటు అది కాస్తా నీళ్ళపైన కదలక మెదలక పడి చచ్చిపోయింది!

పిల్లలు కాపాడిన ప్రయాణీకులంతా ఆ సరికి ఒడ్డుకు చేరుకొని చప్పట్లు కొడుతూ నన్ను అభినందిస్తున్నారు. నేను నా కనుబొమలకు అంటిన చెమటను తుడుచుకుంటూ వాళ్ళవైపు చూసి నవ్వాను.

అంతలో నాకు అనురాధ అక్క గొంతు వినిపించింది. "గెటప్ మా! గెటప్ మా! పి.టి.టైం!!" అని!

నేను సంతోషంగా నవ్వుకుంటూ లేచి నా స్నేహితులందరికీ కలలో నేను ఎన్నెన్ని సాహసాలు చేశానో గొప్పగా వివరించి చెప్పాను. "నువ్వు గొప్ప సాహస వనితవే, సందేహం లేదు" అని అందరూ మెచ్చుకుంటే నాకు బలే గర్వంగా అనిపించింది!



**తమాషా ప్రశ్నలు**

1. న్యాయాధికారి వెయ్యలేని శిక్ష — జ: **పెద్దబాలశిక్ష**
2. నీరు లేని బావి (వెల్) — జ: **ట్రావెల్**
3. పూజకు పనికి రాని పత్రి — జ: **ఆసుపత్రి**
4. ఎక్కడా కనబడని కులం — జ: **గోకులం**

*Y. బాలాజీ, ఎనిమిదవ తరగతి, గుండువారి పెల్లె*

# భలే వెంగళప్ప

*రచన: అఖిల్ కుమార్, భవానీపురం, విజయవాడ.*



ఒకసారి ఓ వెంగళప్ప పని కోసం వెతుక్కుంటూ ఇల్లిల్లూ తిరగసాగాడు "అయ్యా! నాకు ఏమైనా పని ఉంటే ఇవ్వండయ్యా. ఇంతకు ముందు ఒక ఇంట్లో పనోడిగా చేశాను" అంటూ.

ఆ వీధిలో ఒక ఇంటి యజమానికి పనివాడి అవసరం ఉంది. అతను వెంగళప్పను ఎగాదిగా చూసి అడిగాడు- "ఇంతకు ముందు వాళ్ళు నిన్ను ఎందుకు పనిలోనుండి తీసేశారు?" అని.

"అయ్యా, అదే నాకు అర్థం కాలేదయ్యా" చెప్పాడు వెంగళప్ప- "మా యజమాని ఒకసారి 'కాళ్ళ నొప్పి, కాళ్ళనొప్పి' అన్నాడయ్యా. నేను ఆయన కాళ్ళు పిసికాను. బాగుందన్నాడు.

మళ్ళీ ఒకసారి 'భుజం నొప్పి, భుజం నొప్పి' అన్నాడయ్యా. నేను వెళ్ళి భుజాలు నొక్కాను. 'చాలా బాగుందిరా' అని మెచ్చుకున్నాడు. ఇంకోసారి 'నడుము నొప్పి, నడుమునొప్పి!' అని మొత్తుకున్నాడయ్యా. సరేనని నేను నడుము పిసికాను. 'బలే ఉంద'ని



మెచ్చుకున్నాడయ్యా.

తరువాత కొన్ని రోజులకు 'మెడ నొప్పి మెడనొప్పి' అన్నాడయ్యా. 'దానిదేముంది' అని నేను పోయి మెడ పిసికానయ్యా. అప్పటినుండి ఆయన కదలకుండా అలాగే ఉన్నారు.




ఆ ఇంట్లో వాళ్లందరూ నేనే ఆయనను చంపానని నన్ను పనిలోనుండి తీసేశారయ్యా.

ఇంటి యజమాని ఆశ్చర్యపోయి నోరు తెరిచాడు కొంతసేపు. అయినా అతనికి పనివాడి అవసరం ఉంది మరి- "నా దగ్గర మాత్రం అలాంటి పిచ్చి పనులు చేయకు, నువ్వు పనిలోకి రావచ్చు" అనేశాడు చివరికి.

"చాలా ధన్యవాదాలయ్యా" చెప్పాడు వెంగళప్ప. పనిలోకి చేరి "ముందుగా ఇప్పుడు ఏం చేయమంటారయ్యా?" అని అడిగాడు.

"వీడు నా కొడుకు- మూడేళ్లు రాలేదింకా. అమ్మగారు పనిలో ఉన్నట్లున్నారు, ముందు వీడిని కొంచెంసేపు బయటికి తీసుకెళ్లి ఆడించు" అని అన్నాడు.

"అలాగేనయ్యా" అని పిల్లవాడిని తీసుకెళ్లాడు వెంగళప్ప.

యజమాని ఇక ఆ సంగతే మర్చిపోయాడు. కొంతసేపటికి వెంగళప్ప ఒక్కడే వెనక్కి తిరిగి వచ్చాడు.



"ఒరేయ్! మాబాబు ఏడి?!" అని అరిచాడు ఇంటి యజమాని.



"అయ్యా! నేను మీవాడిని బయటికి తీసుకెళ్ళానా, ముందు వాడు బయట ఇసుకలో ఆడుకుంటానన్నాడు. నేను వాడిని ఇసకలో వదిలేశాను. కొద్దిసేపటికి తిరిగి వచ్చి, "ఇప్పుడు పార్కులో ఆడుకుంటా" అన్నాడు. "సరేలే" అని వాడిని తీసుకెళ్ళి పార్కులో వదిలేశాను.

మళ్ళీ వచ్చి "ఈసారి రోడ్డుమీద ఆడుకుంటా" అన్నాడు. "పోనీలే, దానిదేముంది" అని రోడ్డు మీద వదిలేశాను.

తర్వాత కొద్దిసేపటికి తిరిగొచ్చి "ఈ బావిలో ఆడుకుంటా" అన్నాడు. "ఆడుకో" అని ఈసారి బావిలోకి వదిలేశాను- కానీ ఎంతసేపు చూసినా వాడు పైకి రాలేదయ్యా. దాంతో 'ఇంక పనిచేటు ఎందుకు' అని నేను ఒక్కడినే ఇక్కడకు వచ్చేశానయ్యా!" చల్లగా చెప్పాడు వెంగళప్ప.

ఇంటి యజమాని గుండెకు ఏమైందో మరి మీరే ఊహించుకోండి!



**చవక బేరం!**

రాజు: నిన్నటి న్యూస్‌పేపర్ కొన్నావెందుకు?

వెంగళప్ప: చవకగా ఇస్తేనూ... *Y. బాలాజి, ఎనిమిదవ తరగతి, గుండువారి పల్లె*

**రేపు ఇస్తాను!**

సుబ్బారావు: మీ బాస్ పోయిన నెల నుంచి జీతం ఎక్కువగా ఇస్తున్నాడట?

అప్పారావు: ఆ అవును ఒట్టి చెక్కులిచ్చాడు. ఇలాగే పని చేస్తే వచ్చే ఏడాది సంతకం పెడతాడట!

*Y. బాలాజి, ఎనిమిదవ తరగతి, గుండువారి పల్లె*



# జీవన సూత్రం

*అనువాద కథ సౌజన్యం: ఎ.నాగరాజు, బెంగళూరు. అనుసరణ: నారాయణ, కొత్తపల్లి.*

రామాపురంలో నివసించే రంగయ్య మంచి ఆదర్శ రైతు. అతని పొలంలో పండే మొక్కజొన్న అద్భుతంగా ఉంటుందని చెప్పుకునేవాళ్ళు. లావుగా, బలంగా ఉండే మొక్కజొన్న పొత్తులతో అతని పొలం టన్నుల దిగుబడినిచ్చేది. ప్రతి ఏడాదీ రాజధానిలో జరిగే పంటల పోటీకి తన పంటను పంపించేవాడు రంగయ్య. ప్రతిసారీ అతని పంటకే అక్కడ మొదటి బహుమతి వస్తూండేది.

ఒకసారి అతన్ని ఇంటర్వ్యూ చేసేందుకు వచ్చిన విలేఖరి అడిగాడు: "ఇన్నేళ్ళుగా మీరు ప్రతిసారీ మొక్కజొన్న పండిస్తున్నారు; ప్రతిసారీ మీరే మొదటి బహుమతి సాధిస్తూ వస్తున్నారు కదా, మీరు ఏ కంపెనీ విత్తనాలు వాడుతున్నారు?" అని.

రంగయ్య అన్నాడు- "అట్లాంటిదేమీ లేదండి, నేను అసలు ఏ కంపెనీ విత్తనాలూ

కొనను" అని.

విలేఖరి వ్యవసాయం గురించి కొంచెం చదువుకున్నవాడు. అతను ఆశ్చర్యపోయాడు- "అంటే మీ విత్తనం.. నాటు విత్తనమా?" అని.

"అవునండి. నా పంటకు ఆధారం నాటు విత్తనమే" చెప్పాడు రంగయ్య.

"మరి నాటు విత్తనాలలో దిగుబడి రాను రాను తగ్గిపోతుంది కదా?!" అడిగాడు విలేఖరి.



"ఎందుకు తగ్గాలి?" అడిగాడు రంగయ్య. "నా విత్తనాల శక్తి అయితే మరి ఇంతకాలంగా ఏమీ తగ్గలేదు. నిజానికి ఈ విత్తనం మా నాన్న తరం నుండి వస్తూ ఉన్నది- దీని శక్తి తగ్గలేదు కదా మరి?"

"అట్లా కాదు- ఇప్పుడు మీరు ఒక కంపెనీ వారి మొక్క జొన్న వేశారనుకోండి. మీ ప్రక్కవాళ్ళు వేరే రకం వేసి ఉండచ్చు- అప్పుడు మీ పంటకు కావలసిన పుప్పొడి రేణువులు ప్రక్క పొలం నుండి, వాళ్లకు మీ పొలం నుండి- అట్లా వేరు వేరు చోట్ల నుండి వచ్చిన పుప్పొడి రేణువులు కలవటం వల్ల, వేరు వేరు లక్షణాలున్న కొత్త పంట తయారు అవుతూ పోతుంది. క్రమంగా మీ పంట నాణ్యత మారిపోతుంది, మీకు తెలియకుండానే!" వివరించాడు విలేఖరి.

"అట్లా అవ్వదులెండి, మీకు తెలీదు" అన్నాడు రంగయ్య.

"ఎందుకు కాదు?" అడిగాడు విలేఖరి.

"మా ఊళ్ళో రైతులకు అందరికీ ఓ అలవాటుంది- మేం ఒకరి విత్తనాలు ఒకరం పంచుకుంటుంటాం" చెప్పాడు రంగయ్య.

"అవునా?!" ఇంకా ఆశ్చర్యపోయాడు విలేఖరి. "మీ అవార్డు విత్తనాలను కూడా మీరు ఊళ్ళో అందరితోటీ పంచుకుంటారా?!"

"అవును. లేకపోతే కుదరదు. మా పొరుగు రైతులు సత్తువలేని పంట పండిస్తే, వాళ్ల పంటనుండి మా పొలంలోకి వచ్చిన పుప్పొడి, మా విత్తనాల నాణ్యతను దెబ్బతీస్తుంది కదా! నా విత్తనం బాగుండాలంటే, మా పొరుగు రైతులు నాణ్యమైన పంట పండించటం తప్పని సరి" చెప్పాడు రంగయ్య.

అతని అవగాహనకు విలేఖరి నివ్వెరపోయాడు.

నిజంగా చూస్తే 'ఇదే మంచి జీవన సూత్రం కూడా' అనిపిస్తుంది. మనం సంతోషంగా, నిండుగా, అర్థవంతంగా జీవించాలంటే, మన చుట్టూ ఉన్నవారితో మన సంతోషాన్నీ, జ్ఞానాన్నీ పంచుకోవటం తప్పనిసరి. జాగ్రత్తగా చూస్తే మనవల్ల స్పృశించబడే వారివల్లనే మన జీవితానికీ ఒక విలువ ఏర్పడుతుంటుంది. మన చుట్టూ ఉన్నవాళ్ళు బాధ పడుతూ ఉంటే మనం ఒక్కరం సంతోషంగా ఉండటం కష్టమౌతుంది కదా. అలా సమాజంలో ఒకరి సంతోషం మిగతా వాళ్లందరి సంతోషంతోటీ ముడిపడి ఉన్నది!

దీన్ని కావాలంటే సమైక్యతా బలం అనచ్చు; విజయ రహస్యం అనచ్చు; జీవన సూత్రం అనచ్చు- కానీ సత్యం ఏంటంటే- 'అందరం గెలిచేవరకూ ఏ ఒక్కరమూ గెలవలేం'. సమాజ శ్రేయస్సులోనే వ్యక్తి శ్రేయస్సు ఇమిడి ఉన్నది!



బాబు: నాన్న సినీహీరోలు చల్లగావుంటారెందుకు?

నాన్న: వాళ్లకి ఫాన్స్ ఎక్కువగా ఉంటారు బాబు.

*వి.వి.యస్.మూర్తి గారు, చొదిమెళ్ల గ్రామం*

నాన్న: ఒరే కార్తీక్! పరీక్షలో ఎన్ని మార్కులు వచ్చాయిరా?

కార్తీక్: కోడి గుడ్డులా ఉంటుంది, కానీ గుడ్డు కాదు ఏమిటది?

నాన్న: ఏమోరా, తెలీదు- నువ్వే చెప్పురా!

కార్తీక్: సున్నా నాన్నా! అమాత్రంతెలీదూ?!

*`లలిత, ఎనిమిదవ తరగతి, గుండువారిపల్లె*



# వెర్రి వెంగళమ్మలు

*రచన: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*



అనగనగా ఒక ఊళ్ళో పశువుల వ్యాపారి ఒకడు ఉండేవాడు. అతని భార్య వెంగమ్మ నిజంగానే ఒట్టి వెర్రి వెంగళమ్మ. ఒక రోజున వ్యాపారి ప్రక్క ఊరి సంతకు ప్రయాణం అయ్యాడు. వెళ్తూ వెళ్తూ అతను భార్యతో చెప్పి వెళ్ళాడు- "నేను రెండు రోజుల వరకూ తిరిగి రాను వెంగమ్మా! అయితే రేపు మన దగ్గరున్న మూడు ఆవుల్నీ కొనేందుకు బేరగాళ్ళు వస్తారు. ఒక్కో ఆవూ వంద నాణాల లెక్కన, మూడు ఆవులనూ మూడు వందల నాణాలకి అమ్ము. సరేనా?!

వాళ్ళు అంతకంటే తక్కువకి బేరం అడిగితే మటుకు ఏమాత్రం ఒప్పుకోకు. అర్థం అయిందా, నేను చెప్పేది?!" అని.

"మీరేం కంగారు పడకండి, ప్రశాంతంగా వెళ్ళి రండి. అదంతా నేను చూసుకుంటాగా!" అంది వెంగమ్మ.

"ఏంటోనే, నువ్వు ఎప్పుడూ అలాగే చెప్తావు; కానీ ఏదో రకంగా పిచ్చి పనులు చేసి మోసపోతావు! ఈ విషయంలో ఏమీ తప్పులు జరగకుండా ఉండాలనే ఇంత చెప్తున్నాను- మూడు వందలు ఇస్తేనే ఆవుల్ని ఇవ్వు. అర్థమైందా, ఏమి?! నేను చెప్పేది వింటున్నావా?!" అన్నాడు.

"ఆఁ విన్నా, విన్నా!" అన్నదామె, తల ఊపుతూ.

వ్యాపారి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

తర్వాతి రోజున అనుకున్నట్లుగానే బేరగాడు వచ్చాడు. ఆవులను చూసి, ఆమెతో బేరం మొదలు పెట్టాడు. మాట్లాడటం మొదలు పెట్టిన కొద్దిసేపటికే వెంగమ్మ ఎంత అమాయకురాలో గ్రహించేశాడు ఆ బేరగాడు. బేరం ఇంకా పూర్తి కూడా కాకనే, వాడు పశువుల పాక దగ్గరికి వెళ్ళి "సరే అక్కా! ఇంక ఆవులను నేను కొనుక్కున్నాను!" అంటూ ఆవులకు కట్టిన పలుపుతాళ్ళు విప్పి వాటిని బయటకి తోలటం మొదలు పెట్టాడు గడుసుగా.



వెంగళమ్మ అమాయకురాలే అయినా, మరీ ఇంత గడుసుదనాన్ని గమనించకుండా ఉండలేకపోయింది. పోయి కొట్టం గడప దగ్గర నిలబడి "ఒక్క నాణెం తక్కువైనా ఆవులను ఇవ్వను- ముందు మొత్తం మూడు వందల నాణాలు ఇచ్చి, ఆ తర్వాతనే ఆవులను బయటకి తోలండి!" అంది మొండిగా.

"ఇబ్బంది వచ్చి పడిందే-" అనుకున్నాడు బేరగాడు. అయినా మరో బాణం వేసి

చూద్దామని, "అయ్యో అక్కా! నా దగ్గరుండగా నీ డబ్బు ఎక్కడికి పోతుంది? అయినా ఇవాళ్ళ డబ్బుల మూటను తీసుకురావడం మర్చిపోయానే, ఏం చేయను? -సరే, ఒక పని చేద్దాం! ఈ మూడు ఆవుల్లోనూ ఒక దాన్ని నీ దగ్గరే హామీగా వదిలి వెళతాను. ఇంటికి వెళ్ళి, మూడు వందల నాణాలు తెచ్చి ఇచ్చాక గానీ ఈ ఆవును విడిపించుకు పోను!" అన్నాడు, ఆ మూడు ఆవుల్లోనే ఒకదాన్ని గాటానికి తిరిగి కట్టేస్తూ.

వెంగమ్మ ముఖం వెలిగింది. "ఆఁ అదీ మరి! ఏమీ హామీ లేకపోతే ఎలా?! అలా చెయ్యి. ఆ మూడో ఆవుని ఇక్కడే ఉంచి వెళ్ళు. డబ్బు నా చేతిలో పడ్డాకే, ఈ ఆవుని వదిలేది!" అంది గట్టిగా.

బేరగాడి పంట పండింది. ఉత్సాహంతో మురిసిపోయి, అతి మర్యాద నటిస్తూ, తాను ఆసరికే కట్టేసిన ఆవును అక్కడే వదిలి, మిగిలిన రెండు ఆవులనీ తోలుకుని చక్కా పోయాడు వాడు.

మూడో రోజున భర్త రాగానే తాను చేసిన ఘనకార్యాన్ని భర్తతో సంతోషంగా చెప్పింది వెంగమ్మ. వ్యాపారికి నవ్వాలో ఏడవాలో తెలియలేదు- కోపం ముంచుకుని వచ్చింది.

"ఛీ! ఛీ! నీ కంటే తెలివి తక్కువ మనిషి ఈ లోకంలో లేరు. వాడు మళ్ళీ వస్తాడుటే, నీ వెర్రి గానీ?!" అని అరిచాడు ఆవేశంగా.



"అబ్బో! తెలివి నీ ఒక్కడిదేగా?" అంది వెంగమ్మ వెటకారంగా. "నేను అందరి కంటే తెలివి తక్కువ దాన్నా?! ఆ సంగతి నీకెలా తెలుసు? అసలు ఈ లోకంలో ఎట్లాంటి వాళ్ళుంటారో తెలీనిది నీకే. వెళ్ళి ఓసారి దేశం అంతా తిరిగి, చూసిరా!" అంది ఈసడిస్తున్నట్లు.

ఆమె అమాయకపు మాటలకి వ్యాపారికి బలే

కోపం వచ్చింది. అయినా తమాయించుకుని "ఆ బేరగాడి ఆచూకీ తెలుసుకొని వస్తాను ఆగు!" అని హడావుడిగా సంత వైపు బయలుదేరి పోయాడు.

సంతలో మోసగాడి ఆచూకీ కొంత సులభంగానే దొరికింది. వాడి ఊరు మరీ ఏమంత దూరం కాదు. వ్యాపారి ఆ మోసగాడి ఆనవాలు పట్టుకుని ఆ ఊరికి బయలుదేరాడు.

నడుస్తూ నడుస్తూ వెనుదిరిగి చూసిన వ్యాపారికి ఓ వింత దృశ్యం కనబడింది. అతని వెనకగా ఎద్దుల బండి ఒకటి వస్తున్నది. ఆ బండి ఇరుసుపైన ఒక కాలు నిటారుగా మోపి, క్రిందికి పడిపోకుండా సర్దుకుంటూ నిలబడి బండిని తోలుతున్నది ఒకామె. బండిలో నిండుగా గడ్డి ఉంది- కావాలనుకుంటే ఆమె గడ్డి మీదైనా కూర్చోవచ్చు; లేదా దిగి నడుచుకుంటూ అయినా రావొచ్చు. రెండూ కాకుండా ఇరుసు మీద ఎందుకు, అలా ఒంటికాలి మీద నిలబడటం? 'ఈమె ఎవరో గొప్ప అమాయకురాలిలాగానే ఉంది' అనుకుని నవ్వుకున్నాడు వ్యాపారి.

వెంటనే అతనికి వెంగమ్మ మాటలు గుర్తొచ్చాయి. "పాపం, వెంగమ్మ మాటలు నిజమే కావొచ్చు- లోకం ఏమంత తెలివిగా లేదు- ఈమె ఎంత వెర్రివెంగళమ్మో కనుక్కుందాం!" అనుకున్నాడు.

కొంచెంసేపు ఆగి, బండి తన దగ్గరికి రాగానే ఆమెని పలకరిస్తూ "ఏమమ్మా, ఎందుకట్లా ఒంటి కాలిమీద నిలబడటం? పడితే ప్రమాదం కదా? గడ్డి మీద కూర్చొని రావొచ్చు; లేకపోతే అసలు పూర్తిగా దిగి నడిచి రావొచ్చు" అన్నాడు అతను.

“మా అబ్బాయి అట్లా చెప్పలేదు- బండి మీదే రమ్మన్నాడు" అన్నదామె పడిపోకుండా మళ్ళీ సర్దుకొని నిలబడుతూ- "ఇంతకీ నువ్వెవరు? నిన్ను మా ఊళ్ళో ఎప్పుడూ చూడలేదు- ఏదో ఆకాశంలో నుండి ఊడి పడ్డట్లున్నావు!" అన్నది ఆమె.

వ్యాపారికి ఆమెను కొంచెం ఆటపట్టించాలనిపించింది. "అవునవును- బలే కనుక్కున్నావే?! నిజంగానే నేను

ఆకాశం నుండి ఊడిపడ్డాను- మీ ఊరు చూసి పోదామని!" అన్నాడు ఎగతాళిగా.

ఆమె నిజంగానే అమాయకురాలు. వ్యాపారి మాటలు నిజమనుకున్నది. "అవునా, అయితే నిన్నొకటి అడుగుతా చెప్తావా? మా ఇంటాయన పైకి వెళ్ళి మూడేళ్ళవుతున్నది. నీకు ఆయన అక్కడ కనిపించే ఉండాలి కదా, ఎట్టా ఉన్నాడు, కులాసానేనా?!" అని అడిగింది సూటిగా.

'వార్నాయనో, ఈమెవరో మా వెంగమ్మ కంటే వెంగళమ్మ. దేశంలో నిజంగానే చాలామంది అమాయకులు ఉన్నట్లున్నది" అనుకున్నాడు వ్యాపారి- "ఓc, చూడకేమి?! రోజూ చూస్తూనే ఉన్నాను మీ ఇంటాయన్ని. పాపం ఆయనకి అక్కడ గొర్రెలు కాచే పని ఇచ్చారు. మరి అవేమో, ఒక్క చోట నిలవకుండా కొండా-కోనా; గుట్టలూ-మిట్టలూ తిరుగుతున్నాయి. వాటి వెంబడి తిరగలేక మీ ఆయన నానా అవస్థలు పడుతున్నాడు. గుడ్డలు కూడా పీలికలై పోయాయి!" అన్నాడు పైకి.

"అయ్యో, మాకు ఎట్టా తెలుస్తుంది ఆ సంగతి?! మేం ఇక్కడే ఉన్నామాయె. అయినా మొన్న సంక్రాంతి పండక్కి బట్టలు కూడా పెట్టుకున్నామే; అంత అవసరం ఉంటే వచ్చి తీసుకు పోకూడదా?" అని యాష్టపడిపోయిందామె. "ఇక్కడే ఉండండి, ఇంటికి పోయి గుడ్డలు తెచ్చిస్తాను. ఈసారి పైకి వెళ్ళగానే మా యింటాయనకు ఇద్దురు" అని వేడుకున్నది.

వ్యాపారికి నవ్వు ఆగలేదు. ఆమెని ఇంకా పరీక్షించటం కోసం అతను "అది వీలు పడదు తల్లీ, ఆకాశానికి ఒక పెద్ద ద్వారం ఉంటుంది. అక్కడ ఉండే ద్వారపాలకుడికి లంచం ఇస్తేగాని వేటినీ లోపలికి తీసుకోని పోనివ్వడు, ఏం చేయను?!" అన్నాడు.

"అలాగేలే, ఎంతో కొంత ఇస్తే సరి! నిన్ననే మా అబ్బాయి ధాన్యం అమ్మిన డబ్బులు తెచ్చి ఇనప్పెట్టెలో పెట్టాడు. గుడ్డలు, డబ్బులు తెచ్చి ఇస్తాను- కాసేపు ఆగండి" అని బండిని తోలుకొని ఇంటికి వెళ్ళింది ఆమె. వ్యాపారి అక్కడే ఆగిపోయాడు. కొద్దిసేపటికల్లా గుడ్డలు, పైకం తీసుకుని అక్కడకి వచ్చింది అమె!

'ఈమె వెంగమ్మకు అక్క' అని గ్రహించిన వ్యాపారి కలవర పడిపోయి "ఒక్కసారి మీ అబ్బాయిని చూసి వెళతాను తల్లీ!" అని ఆమెతోపాటు వాళ్ళ ఇంటికి వెళ్ళాడు. ఆమె కొడుకుకు జరిగినదంతా చెప్పి, ఆమె ఇచ్చిన డబ్బులు, గుడ్డలు అతనికి తిరిగి ఇచ్చేశాడు.

ఆ యువకుడు వ్యాపారికి అనేక కృతజ్ఞతలు చెప్పుకుని "మీరెవరు? ఏం పని మీద వచ్చారు?' అని అడిగాడు.

"నా భార్య వెంగమ్మ కూడా మీ అమ్మ మాదిరిదే- ఏమీ తెలీదు పాపం. మొన్న నేను ఊళ్ళో లేనప్పుడు మీ ఊరివాడు ఎవడో వచ్చాడట; మా వెంగమ్మని మోసం చేసి ఆవులని రెండింటిని తీసుకెళ్ళిపోయాడు. వాడిని వెతుక్కుంటూ నేను ఇట్లా వచ్చాను" చెప్పాడు వ్యాపారి విచారంగా.

ఆ కుర్రవాడికి ఊళ్ళో వాళ్ళంతా పరిచయమే- "ఓ, వాడు నాకు తెలుసు. వాడో పెద్ద మోసగాడు. నిన్ననే రెండు ఆవుల్ని తెచ్చాడు. అవి మీవే అయి ఉంటాయి- చూద్దాం పదండి" అని అతని ఇంటికి తీసుకు వెళ్ళాడు వ్యాపారిని.

తన ఆవుల్ని చూడగానే గుర్తుపట్టాడు వ్యాపారి. అవి కూడా వ్యాపారిని చూసి సంతోషంగా అరిచాయి. వెంటనే వ్యాపారి న్యాయాధికారికి ఫిర్యాదు చేయటం, న్యాయాధికారి విచారణ జరిపి మోసగాడిని శిక్షించటం, జరిమానాతో సహా ఆవుల్ని వ్యాపారికి ఒప్పచెప్పటం జరిగాయి.

వ్యాపారి ఇంటి కొచ్చి ఆవుల్ని కొట్టంలో కట్టేస్తుంటే "నేను చెప్పలేదూ, అతను చాలా మంచివాడేనని?! పాపం, మన ఆవుల్ని మనకు ఇచ్చేశాడు చూడు!" అన్నది వెంగమ్మ.

"నిజమేనే, లోకంలో నీలాంటివాళ్ళూ, నాలాంటివాళ్ళూ చాలా మందే ఉన్నారు. వాడిలాంటివాళ్ళూ ఉంటారు. అయితే అమాయకుల్ని మోసం చేస్తే ఎప్పటికైనా శిక్ష మటుకు తప్పదు"అన్నాడు వ్యాపారి.



# యుగకర్త స్వగతం

రచన: సిహెచ్: క్రాంతి, ఇంటర్మీడియట్, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.

"టెక్కలి"లో ఒకనాటి సాయంత్రం. ఏటి ఒడ్డున ఒక కుర్రాడు మౌనంగా కూర్చుని, గలగలా ప్రవహిస్తున్న నీటినే చూస్తున్నాడు.

గత కొద్ది రోజులుగా ఆ కుర్రాడిది ఇదే వరస. ఖాళీ సమయం దొరికితే చాలు, ఈ ఏకాంత ప్రదేశానికి చేరుకుంటాడు. ఇక్కడ కూర్చొని తనలో చెలరేగుతున్న ఆలోచనలకు పరిష్కారాలు వెతుక్కుంటాడు.

ఏటి నీరు తనకు నచ్చిన చోటుకు ప్రవహిస్తున్నట్లు, అతని మస్తిష్కం తనలో తలెత్తే ఊహలకు తగిన మార్గాలను అన్వేషిస్తున్నది.

బాధల్ని భరిస్తూ బ్రతుకు భారాన్ని మోస్తున్న జనులు- తిండి లేక తల్లడిల్లిపోతున్న జనులు- సమాజంలో పెట్రేగిపోతున్న అరాచకాలు- ఇవన్నీ అతనికి నిద్రలేకుండా చేస్తున్నాయి. తను చూసిన ప్రతి విషయాన్నీ, తెలుసుకున్న ప్రతి విషయాన్ని

ఆలోచనాత్మకంగా పరిశీలించటం ఎంతో కాలంగా అతనికి అలవాటైపోయింది.

ఇతర దేశాలలో యువత పైకి ఎదుగుతున్నారు. కానీ మన దేశంలోని యువత? వ్యసనాలకు బానిసై, పూర్తిగా అడుగంటి పోతున్నది. నిర్వీర్యమైపోతున్న ఈ యువతను మేల్కొలిపేదెలాగ? చరిత్రను తిరగరాసి, మరో తరానికి అందించేదెలాగ? సమస్యలనేవే ఉండకూడదు మరో తరంలో!" -ఇలా సాగేవి అతని ఆలోచనలు.

కుర్రాడి ప్రవర్తన అతని కుటుంబ సభ్యుల్ని చాలానే ఆందోళనకు గురిచేసింది. అయినా అతని మీద వాళ్ళకు విశ్వాసం ఉంది. అతను ఏ తప్పూ చేయడని నమ్మకం ఉంది. కనుక వాళ్ళూ బయటపడి అతన్ని ఏమీ అనలేదు- అయినా.. సముద్రంలో రేగే కెరటాలకైనా ఓ తీరం దొరుకుతుందేమో కానీ, అతని మనసులో రేగే ఆలోచనలకు మాత్రం ఎలాంటి తీరమూ దొరకట్లేదు.

నీటి ప్రవాహంలో రేగిన అలలు ప్రక్కనే ఉన్న తీరాన్ని తాకుతున్నాయి. శక్తి క్షీణించి నశిస్తున్నాయి. చల్లగాలిలో సేదతీరుతూ కొద్దిసేపు ఈ లోకాన్ని మరచిపోయాడతను.

హఠాత్తుగా ఎవరో తనను పిలవటంతో ఉలిక్కిపడి చూశాడు- చేతిలో చపాతీల బాక్సు, శాలువతో అతని అక్క. "తమ్ముడూ! నీ కోసం అమ్మ చపాతీలు పంపించింది. ఈ రోజు చపాతీలు అమ్మ, నేను కలసి చేశాము. చలికాలం కదా, బాగా చలివేస్తుంది- అందుకని అమ్మ ఈ శాలువా కూడా పంపించింది. చీకటయ్యేసరికల్లా ఇంటికి రమ్మని చెప్పింది" తమ్ముడికి చెప్పి, వేగంగా వెనుదిరిగి పోయిందామె.

అమాయకత్వంతో నిండిన అతని కళ్ళు ఇప్పుడు ప్రకృతి అందాలవైపు మరలాయి.. "ప్రకృతి నిజంగా ఎంత స్వచ్ఛమైనది కదా!" అనుకున్నాడతను. "స్వార్థ పథాన సాగే జన జీవనం ప్రకృతిని కలుషితం చేసింది.. స్వచ్ఛత అంటే ఏంటో కూడా తెలియకుండా పోయింది.." చీకటి కావస్తున్నది. "జ్ఞానం కన్నా ఆలోచనాశక్తి గొప్పది" ఐన్‌స్టీన్ చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయతనికి.

అక్కడి నుండి లేచి వీధిలో నడవసాగాడతను. పట్నం దగ్గరికి వచ్చేసరికి

ఓ బిచ్చగాడు కనబడ్డాడు- అతనో ముసలివాడు. పొట్ట వెన్నెముకకు అంటుకుపోయి ఉన్నది. అతని కళ్ళు ఉబ్బి గాలితోటీ, నీటితోటీ నిండినఅతని కడుపును ప్రతిఫలిస్తున్నాయి. బక్క చిక్కిన అతని శరీరం చలికి లేత ఆకు మాదిరి వణుకుతున్నది.



"ప్రపంచంలో ఎన్నెన్ని సమస్యలున్నాయో.. అసలు ఈ సమస్యలకు అన్నింటికీ కారణం ఏంటి? పరిష్కారం ఏంటి?" అని మొనదేలిన సూదులు గుచ్చినట్లు గుచ్చే ప్రశ్నలు..

"అసలు ప్రశ్నలు తలెత్తితే చాలు. సమాధానాలు అందరూ ఆలోచించగలరు; తెలుసుకోగలరు. అన్ని సమస్యలకూ కారకులు మానవులే.. కనుక వాళ్ళు ప్రశ్నిస్తే ఇక జవాబులు దొరక్కపోవటం అంటూ ఉండదు.." అనుకున్నాడతను.

"తాతా! ఎందుకు ఇట్లా బిచ్చమెత్తుకుంటున్నావు? ఎక్కడైనా కష్టపడి పని చేయచ్చు కదా" అడిగాడు పైకి.

"ఏం చెప్పమంటావు నాయనా! 'ముసలివాణ్ణి' అని ఎవ్వరూ నాకు పని ఇవ్వటం లేదు. నాకు కూడా ఏమంత సత్తువ లేదు- చేతులు, శరీరం సహకరించటం లేదు. ఆ భగవంతుడు నన్ను పట్టించుకోవట్లేదు. ఎందుకు ఇంత కష్టపెడుతున్నాడో. ఇన్ని కష్టాలకూ కారణం ఆ భగవంతుడే..." అని ఇంకేదో చెప్పబోయాడు తాత.

కుర్రాడు అతన్ని ఖండిస్తూ "లేదు తాతా, అసలు దేవుడంటూ ఉంటే నా కష్టం తెలుసుకునేవాడు; నీ కష్టాన్ని తీర్చేవాడు. మన సమస్యలు అన్నింటికీ మనమే కారణం. కష్టంలో దేవుడి గురించి ఆలోచించుకుంటూ కూర్చుంటే, ఉన్న సంతోషాలు

దూరమవుతాయి. ఎంత దు:ఖం ఉన్నా సరే మన ఆనందాన్ని మనమే వెతుక్కుంటూ పోవాలి- అదే అసలైన బ్రతుకు. ఇదిగో.. ఇవి తీసుకో" అని చపాతీల బాక్సు, శాలువా అతని చేతిలో పెట్టాడు.

"బాబూ! నాకు ఇచ్చేస్తున్నావ్, మరి నీకు?" అడిగాడు ముసలాయన.

కుర్రాడు చిన్నగా నవ్వి, "తాతా! నీలో సత్తువ పోయింది. రాత్రికి రాత్రి ఎలాగూ బిచ్చం అడుక్కోలేవు. ఇది తీసుకొని తిను. ఇక నాకు- ఇవాల్టికి ఇది లేకపోయినా పర్వాలేదు. ఎలాగూ ఇంటికి వెళ్తున్నానుగా?! నాలో సత్తువ చాలా ఉంది. మా అమ్మ కనిపించే దేవత. దేవతలాంటి అమ్మ ఉన్నంత వరకు నాకు కష్టం రాదు. అయినా నేను కష్టాన్ని చూసి కష్టపడనులే" అన్నాడు కుర్రాడు.

కష్టానికి భయపడని ఈ కుర్రవాడు, సమాజంలో సమూలమైన మార్పు కోసం ఏదో చెయ్యాలని తపిస్తున్న ఓ సంఘసంస్కర్త. ప్రకృతిని కాపాడే ఓ రక్షకుడు. ఎవరేమనుకున్నా, అతని ఆలోచనల్లో మాత్రం ఒక మెరుపు ఉంది-

"మన పుస్తకాలలోని గాంధీ, సుభాష్ చంద్రబోస్, భగత్ సింగ్, చేగువేరా లాంటి వాళ్ళు కారు, ఈనాడు మనల్ని శాసిస్తున్న రాజకీయ నాయకులు. మన ప్రజలూ అలాంటి వారే- ఎవడికి ఏది నచ్చితే అదే వాడికి రైట్. అంతే తప్ప, అది 'మంచా-చెడా' అని ఆలోచించడు... ఈ పరిస్థితుల్లో మన సమాజాన్ని మార్చాలంటే కష్టమే- కానీ మార్చగలం" అనుకునే యుగకర్త అతను. ✷

## మరిన్ని సొంత కథలు రాయండి!

కొత్తపల్లికి ఏడేళ్ళ సందర్భంగా పిడూరి కృష్ణమూర్తి తాతగారు మిమ్మల్ని ఆశీర్వదిస్తూ ఇస్తున్న కానుక! మీరు సొంతగా ఊహించి రాసిన కథ కొత్తపల్లిలో ప్రచురితమైతే ఇప్పుడు ఓ కొత్తపల్లితోబాటు తాతగారి తరపున 100రూ.ల **నగదు బహుమతిని** కూడా అందుకోండి! ఈ బహుమతి కేవలం మనదేశంలో నివసిస్తున్న పిల్లలకు మాత్రమే! మరి కాయితాలు, పెన్ను తీయండి- నడుం బిగించండి- ఓ చక్కని సొంత కథ రాసేసి పంపండి. చివర్లో మీ పేరు, తరగతి, మీరు చదివే బడి పేరు, మీ చిరునామా, మీవాళ్ళ ఫోను నెంబరు రాయటం మర్చిపోవద్దండి!

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**స్నేహితుడు, ఉడత, జంతువులు, మనుషులు, ఆహోరం, తలక్రిందులు, కూరగాయలు, ప్రస్తుతము, అయిష్టము, సహాయము, సొంతకథ, ఆసుపత్రి, కోయిల, మదనపల్లి, మందవిషము, వివేకము, పాము, బొరియలు, పిడిసెడు, పిల్లవాడు. -** ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి! వాటి చుట్టూ గుండ్రాలు గీయండి చూద్దాం!

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| థ | క | ము | ష | సొం | మ | ను | షు | లు | మా | య | పా |
| స్నే | హి | త | ష్ట | ము | క | వే | వి | రం | వు | క | స్తు |
| ప్ర | వే | స్తు | సా | స్తు | డు | రం | హో | ఆ | త | తు | మం |
| వి | స్తు | ప్ర | అ | తు | వే | సె | మం | సొం | య | డు | జం |
| సె | త్రి | ష్ట | హి | త్రి | ల్లి | ష్ట | డి | ము | జం | వా | త్రి |
| కూ | ము | స్నే | త | మం | ప | ష | ష | పి | యి | ల్ల | సు |
| ర | అ | ష | ల్ల | సొం | న | వి | మం | రం | ల | పి | ఆ |
| గా | వి | లు | లు | పి | ద | ము | య | హో | స | థ | లు |
| య | ష్ట | ము | య | మం | మ | మం | క | వే | వే | వు | దు |
| సె | ము | ష్ట | రి | గా | ల | యి | కో | షు | జం | పా | క్రిం |
| డు | అ | ము | బొ | పా | క | వే | త | డ | ఉ | ము | ల |
| పి | ల్ల | ఆ | సు | ప | త్రి | కూ | ష్ల | ము | షు | ష | త |

# తెలుసుకుందాం!

*నిర్వహణ: కొత్తపల్లి*

## మమ్మీలు!



ఏసు క్రీస్తు పుట్టి ఇప్పటికి దాదాపు 2000 సంవత్సరాలు అవుతున్నది కదా, అంతకు 2500 సంవత్సరాల ముందు- అంటే ఇప్పటికి దాదాపు నాలుగువేల ఐదువందల సంవత్సరాల క్రితం- ఈజిప్టును "ఫారో"లు పరిపాలించారు.

ఆనాడు "ఫారో" కేవలం రాజు మాత్రమే కాదు- అద్భుత శక్తులకు ఆయన ప్రతీక; భగవంతునితో నేరుగా సంబంధం కలిగి ఉండే మంత్రవేత్త. రాజ్యంలో ఉండే అద్భుత సంపదలన్నిటికీ ఆయనే అధిపతి; ఈ భూమి మీద నడిచేదేవుడు ఫారో. ఆ ఫారోల శరీరం మామూలుది కాదు- దివ్య శరీరమే అది; అందరూ ఎల్లకాలమూ పూజించుకోవలసిన శరీరం అది. అట్లాంటి శరీరం నశించిపోతే, మరి దాన్ని అందరూ పూజించుకునేది ఎలాగ? అందుకని ఆనాటి వైద్యులు ఫారోలు చనిపోయాక, వాళ్ళ శరీరాలను 'మమ్మిఫై' చేయటం మొదలుపెట్టారు-

ఫారోల శరీరాల్లోంచి మెదడును, ఇతర పెద్ద అంతర్గత అవయవాలను అన్నింటినీ తీసేసి, ఎంపిక చేసిన రసాయనాలను శరీరంలోపల అంతా కూరేవాళ్ళు. పైన చర్మం పాడవ్వకుండా ఉండేందుకు గాను రకరకాల లేపాలను పూసి, శరీరం మొత్తాన్నీ బట్టతో గట్టిగా చుట్టేసేవాళ్ళు. అట్లా తయారు చేసిన 'మమ్మీ'ల చర్మం ఇన్ని వేల సంవత్సరాల తర్వాత కూడా పాడవ్వకపోవటం నిజంగా ఆశ్చర్యం; నాటి వైద్య శాస్త్రపు అద్భుతం! 'యునానీ' వైద్యుల

గొప్పతనం.

మరి, మనం- తెలుగు వాళ్ళం- మన అమ్మను చక్కగా 'అమ్మా!' అని పిలవకుండా 'మమ్మీ' అని పిలిస్తే ఏం బాగుంటుంది?!

## ప్రపంచపు వింత- గీజా పిరమిడ్



'మమ్మిఫై' చేసిన ఫారోల శరీరాలను అందుకోసమే ప్రత్యేకంగా నిర్మించిన గొప్ప గొప్ప కట్టడాల్లో భద్రపరచేవాళ్ళు- అవే ఈజిప్టు పిరమిడ్లు. వాటిలో అన్నింటికంటే పెద్దది, 'ఖూఫూ' అనే ఫారో తన శరీరాన్ని భద్రపరచటంకోసం తానుగా కట్టించుకున్న 'గీజా' పిరమిడ్.

దాని ఎత్తు 455 అడుగులు! అంటే కనీసం 45 అంతస్తుల భవంతి అంత!

నేలమీద దాని పొడవు, వెడల్పు 756 అడుగులు!

దానికోసం వాడింది 23,00,000 బండలు. వాటి మొత్తం బరువు కనీసం 59,00,000 టన్నులు! ఇంత బరువును పూర్తిగా మనుషులు- ఎడారి దాటించి తీసుకొచ్చారు- క్రేన్లు, యంత్రాలు ఏవీ వాడకుండా!

గీజా పిరమిడ్ నిర్మాణానికి మొత్తం 20 సంవత్సరాలు పట్టిందట. ప్రతిరోజూ సరాసరి 14,000 మంది పనివాళ్ళు పని చేశారట. అవసరం ఉన్నప్పుడు ఒక్కోసారి 40,000 మంది కూడా పని చేశారట! ఇంత పెద్ద పిరమిడ్ నిర్మాణంలో వచ్చిన తేడాల్లా కేవలం 5.8 సెంటీమీటర్లు! పిరమిడ్ ముఖాలు నాలుగూ డిగ్రీలో వందో వంతు తేడా కూడా లేకుండా ఖచ్చితంగా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశల్ని సూచిస్తున్నాయి!

వీలైతే ఈజిప్టు దేశం వెళ్ళి పిరమిడ్లను చూడచ్చు, మనమూనూ!



# పదరంగం-76

నిర్వహణ: కొత్తపల్లి

| 1 | | 2 | 3 | | 4 |
|---|---|---|---|---|---|
| | ★ | 5 | | ★ | |
| 6 | 7 | | ★ | 8 | |
| 9 | | ★ | 10 | | ★ |
| | ★ | 11 | | | 12 |
| 13 | | | ★ | 14 | |

## అడ్డం

1. 'ని' లేని సప్త స్వరాలు (6)
5. తీగకి మరో పేరు (2)
6. ఇదంటే 'సొంత పరిపాలన' అని అర్థం (3)
8. 'సగం కిలో' అనరు! మరే కిలో? (2)
9. ఐదు అడ్డమే! (2)
10. కత్తితో 'కోసి' అనటమే, మరో విధంగా (2)
11. జాం చెట్టుకు కాసే కాయ! (4)
13. 'పడిశెం'? (3)
14. ఇదంటే లోపల 'ఖాళీగా ఉండటం'- కానీ మరి తిరగబడింది! (2)

## నిలువు:

1. చదువుల తల్లికి చేసే పూజ (6)
2. 'గణతంత్రం'-'1,3,4 (3)
3. 'బుద్ధి' అనేది ఇంకో రకంగా (2)
4. దూరం కాదు (3)
7. తిరగబడ్డ 'భూతకాలం' (2)
8. కాలు క్రింది వైపును ఇలా అంటారు! (4)
10. చిట్టిప్రాణి, నిరంతర శ్రమ జీవి! (2)
11. ఉత్తరం (2)
12. వేటగాడు తిరగబడ్డాడు! (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి-78 ని బహుమతిగా పంపిస్తాం!

కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

స్వాగతం!

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్నీ, బొమ్మల్నీ సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. సాయం చేయండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

**వెలల పట్టిక:**

| | వ్యక్తులు | సంస్థలు |
|---|---|---|
| విడి ప్రతి వెల (పోస్టేజీ అదనం) | 25 రూ. | 25 రూ |
| సంవత్సర చందా (సాధారణ పోస్టు) | 300 రూ. | 350 రూ. |

బ్యాంకు ట్రాన్సుఫరు కోసం అక్కౌంటు వివరాలు:
Kottapalli Prachuranalu,
S.B. A/c No: 62320333310
SBH- Dharmavaram Branch,
IFSC code: SBHY0020902

సంవత్సర చందాను మనిఆర్డరు/బ్యాంకు ట్రాన్సుఫరు ద్వారా చెల్లించవచ్చు. **దయచేసి మీ చిరునామాను పోస్టు / యస్సెమ్మెస్ / ఇ-మెయిలు ద్వారా విడిగా తెలియజేయండి.** పుస్తకాలను సాధారణ పోస్టులో పంపుతాం, రచయితలు, చిత్రకారులు దయచేసి తమ రచనలను పోస్టు / ఇమెయిలు రూపంలో పంపగలరు. పిల్లల చేత పాడించిన చక్కని పాటల ఆడియోలనూ మాకు పంపండి. పిల్లలకు ఉపయోగకరంగా ఉండేవాటిని తప్పక ప్రచురిస్తాం!


కొత్తపల్లి ప్రచురణలు
1-127/A, యం ఆర్ వో ఆఫీసు దగ్గర,
చెన్నేకొత్తపల్లి- 515101
అనంతపురం జిల్లా
ఫోను: 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in
వెబ్సైటు: http://kottapalli.in



కృతజ్ఞతలు:

సంవత్సరకాలంగా కళాకారులకు తనవంతుగా పారితోషికాన్నిస్తున్న రాధగారికి, ఆఫీసు ఖర్చులకోసం ప్రతినెలా క్రమం తప్పకుండా ఐదువందల రూ.లు పంపుతున్న అరుణగారికి ధన్యవాదాలు. కొత్తపల్లిని మొబైల్ ప్రపంచంలోకి తీసుకు వెళ్లేందుకు ముందుకు వచ్చిన 'న్యూస్ హంట్' వారికి, కొత్తపల్లిలో కథలు రాసిన పిల్లలకు బహుమతినిస్తున్న తాతగారు శ్రీ పిడూరి కృష్ణమూర్తి గారికి వందనాలు.

## కవితల సందడి

వనాలు జగతికి అందిన వరాలు
ధరణి మెడలో సిరుల హారాలు
జీవరాశుల ఆదరించే-
మమతల నిలయాలు
కాలుష్యాన్ని హరించే వీర సైనికులు
వాతావరణాన్ని కాపాడే విశ్వరక్షకులు
ఫలితం ఆశించని స్వచ్ఛంద సేవకులు

వానా వానా వల్లప్ప
నువ్వు రాకుంటే,
నదులు-చెరువులు నిండకుంటే,
పంటలేవీ పండకుంటే,
ప్రజలకు తిండి లేకుంటే,
పశువులకు మేత లేకుంటే,
ధరలు ఆకాశాన్నంటుతుంటే,
ప్రజల కష్టాలు ఎలా ఉంటాయో తెలుసా
నీకు?!
సమయానికి రామ్మా, వానమ్మా!

-జి.తిష్య, 3వ తరగతి, రాధాస్కూలాఫ్ లెర్నింగ్, అనంతపురం.

పూలకు ఉన్నాయి రేకులు
నవ్వుకు ఉన్నాయి జోకులు
తలుపుకు ఉన్నాయి మేకులు
జన్మదినానికి ఉన్నాయి కేకులు
వంటకు ఉన్నాయి బోకులు
చెప్పేందుకు ఉన్నాయి సాకులు
చదవటానికి లేవు బ్రేకులు

-K. మహేష్, ఏడవ తరగతి, P.V.R. Z.P.H. స్కూల్, గుండువారి పల్లి,

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at “Kottapalli”, 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma